## పాత్రలు:

| | | |
|---|---|---|
| 1. | రాధాకృష్ణ | బాంకు మానేజరు కొత్తగా ప్రమోషన్ వచ్చింది. |
| 2. | చంద్రశేఖర్ | డాక్టర్. రాధాకృష్ణ స్నేహితుడు |
| 3. | నారాయణయ్య | బాంకులో ఒక ఉద్యోగి |
| 4. | లలిత | రాధాకృష్ణ భార్య |
| 5. | శాంత | లలిత స్నేహితురాలు |
| 6. | పిల్లలు | |

## గమనిక:

ఈ నాటకం ప్రదర్శించ గోరేవారు ముందుగా నా అనుమతి తీసుకోవాలి. అనుమతికొరకు సంస్థపేరు, కార్యదర్శిపేరు ప్రదర్శన తేదీ సందర్భము వ్రాస్తూ, జవాబు కొరకు వలయు తపాలాబిళ్ళలు పంపవలెను. ఏది పంపకపోయినను జవాబు పంపబడదు.

గంగాధరరావు

# మ న వి

కథను దేశీయం చేయటానికి చాలా మార్పులు చేయవలసి వచ్చినది. కనుక దీన్ని అనువాదం అనలేం.

సంభాషణలే గాక కొన్ని సన్నివేశాలు గూడా మారటం వల్ల దీన్ని అనుకరణ అని అనకూడదేమో.

ఏదైనా కథా వస్తువూ. భావాలూ, ఎక్కువ భాగం సన్ని వేశాలూ—అన్నీ "యిబ్సన్" వే అవడంవల్ల ఈ నాటకం "యిబ్సన్" దే. తెనిగింపు తెగింపు నాది.

గంగాధరరావు

# సంక్రాంతి



## ఒకటవ రంగం

[రాధాకృష్ణ యింట్లో మధ్యగది సామాన్యంగా చక్కగా అలంకరించి వుంది. ఎదురువైపు వక ద్వారం బయటకు దారి. వెనకవైపు నున్న ద్వారం రాధాకృష్ణ ఆఫీసు గదిలోకి వెళుతుంది కుడివైపు వక ద్వారం యింట్లోకి లోపలి గదుల్లోకి దారి యిస్తుంది. మధ్యలో ఒక రౌండ్ టేబిల్ మూడు కుర్చీలు ఒక ప్రక్క వక సోఫా వున్నాయి.

టేబుల్ మీద ఒకి పేపర్ వెయిట్లూ, పేపరూ వున్నాయి. రెండవప్రక్క వక పడక కుర్చీ వుంది క్రింద తివాసీలు పరచి వున్నాయి. అది చలికాలం.

రాధాకృష్ణ పడకకుర్చీలో పేపరు చదువుకుంటూ వున్నాడు. కాసేపటికి లలిత కుడినుంచి ప్రవేశిస్తుంది— బజారునుంచి కొని తెస్తున్న పాకెట్లు చేతిలో పట్టుకొని అవి టేబిల్ మీద పెట్టి నెమ్మదిగా నిశ్శబ్దంగా రాధాకృష్ణ వెనక్కి వచ్చి కళ్ళు మూస్తుంది.]

రాధా—ఎవరది? మా రామచిలకేనా!

లలి—ఊహూఁ.

రాధా—ఓహో! మా గృహలక్ష్మిగారు గాబోలు.

లలి—(నవ్వుతూ చేతులు వదులుతుంది)

రాధా—(వెనకకు తిరిగి తెచ్చిన పాకెట్లు చూసి) ఏమిటి వన్నీ?

లలి—(నవ్వి వూరుకుంటుంది)

రాధా—ఇవన్నీ కొన్నావా ?

లలి—తెచ్చాను. చాలా చాలా తెచ్చాను. చాలా చాలా ఖిలువైనవి తెచ్చాను. పండక్కి. వెలగల మణులెన్నో ఎంచి తెచ్చాను.

రాధ—ఇవ్వన్నీ కొన్నావా ?

లలి—(అవునన్నట్లు తల వూపుతుంది)

రాధా—హు! మళ్ళీ డబ్బు తగలెయ్యడం మొదలెట్టావన్న మాట.

లలి—కొద్దిగా నేగా, పది హేను రూపాయ లేగాదండీ.

రాధా—పది హేను రూపాయిలు కూడా డబ్బే నేమో.

లలి—కానివ్వండి. ఈ నెలాగడిస్తే 15 రూపాయిలు ఓ లెక్కా మనకి ? నెలాఖరవంగా నే కావలసినంత డబ్బు.

రాధా—నెలఆఖరయిన తర్వాతగా. నెల ఇంకా అవలేదుగా.

లలి—సైగా సంక్రాంతి పండుగ. ఆడపిల్లలు గలవాళ్ళం-మరి తడవకి వక బొమ్మనా కొంటేగాని బొమ్మలు పేర్వడవు. మన చిట్టికి బొమ్మలంటే ప్రాణం.

రాధా—డజను బొమ్మలుకొని తడవకి ఒకట్టంటావేమిటి?

లలి—చిట్టికి బొమ్మల పెళ్ళంటే సరదాకాదూ, అందుకని కావల్సినవన్నీ ఒక్కసారే కొన్నాను. ఇవిగో చూడండీ!

ఇది పెళ్ళికూతురు. ఈయన పెళ్లికొడుకు. సరే, వీళ్లిద్దరూ పెళ్లికొడుకు తల్లి తండ్రీ. వీరు మగపెళ్ళివారు. వీరు ఆడపెళ్లివారు. (నవ్వు) అన్నీ కలిసి ఒక్క పది రూపాయలు.

రాధా—అన్నీ కలిసి 10 రూపాయిలే- ఈకరువురోజుల్లో...

లలి— నెలాఖరవంగానే మనకరువు తీరుతున్నది కదండీ; బాంకు మేనేజరుగా చార్జితీసుకున్నారుగా. ఇది వరకు లాగ ప్రతి నెలాయిహూయిబ్బందిపడం నెలకి 100 రూపాయిలు వచ్చేది ఇక 250 రూపాయిలు వస్తుంది. అందుకని ఇహా అప్పుడప్పుడూ నేను కాస్త డబ్బు తగలెయ్యవచ్చు. బ్యాంక్ మానేజరు అయిన తర్వాత కాస్త దర్జాగా వుండకపోతే ఎలాగా; అందుకని యివ్వికూడా కొన్నాను. (అని మరో పాకెట్ యిస్తుంది. రాధాకృష్ణ పాకెట్ విప్పి చూస్తాడు)

రాధా—కొత్త సూటా !

లలి—ఆ. కొత్తసూటు. (విడివిడిగా చూపిస్తూ) పాంట్-కోట్-షర్టు-టై-అన్నీ కలిసి పాతిక రూ॥లు.

రాధా—నీకేం పిచ్చా లలితా...దీనికంతకీ డబ్బెక్కడిది?

లలి—షాపులో నెలాఖరుకి యిస్తానంటే-సరేనన్నా.

రాధా— నీకేమన్నా మెదడు వుందా? ఇప్పుడీ అప్పు చేశావ్; ఈ నెలాఖరులోగానే నకస్మాత్తుగా 'హరీ' అంటాననుకో 'అంటే' అప్పుడెలాతీరుస్తావ్ !

లలి—పోదురూ! మీరెప్పుడూ యింతే! పండుగపూట్లా పాడుమాటలు!

రాధా—ఆ. మాటవరుసకంటున్నాను. అలాజరిగితే ఏమవుతుంది?

లలి—అప్పుడీ డబ్బువుంటే ఎంత ? లేకపోతే ఎంత ?

రాధా—మరి యీబాకీలెల్లా? షావుకారు వూరుకుంటాడా?

(లలిత మొహం ముడుచుకుంటుంది.)

రాధా—కోపంవచ్చిందా! చూడూ! అప్పుచేసిన పప్పుకూడులో సుఖం, సంతోషం వుండవు. ఇంతవరకూ పరువుప్రతిష్ఠలతో కాలం గడిపాం—భగవంతుడి దయవల్ల—ఈ ప్రమోషన్‌తో మన కరువుతీరింది ఈ రెండు నెలలూ గడిస్తే యిహ అప్పు చెయ్యాల్సిన అవుసరంవుండదు. ఇటు చూడూ! ఇంకా కోపం పోలేదూ? (నవ్వి జేబులోంచి పర్సు—పర్సులోంచి డబ్బూతీసి) ఇదేమిటో చూడండీ పిచ్చుకలగూడెం మహారాణీగారూ!

లలిత—35 రుపాయిలు అమ్మయ్య! పండగ ఖర్చు గడచిపోతుంది.

రాధా—ఆ! ఆ. అదినాకు తెల్సు. నీచేతిలో డబ్బు హారతి కర్పూరం. వేరే ఆఖర్చు యీఖర్చు చెయ్యక ముందు ఆషాపులో బాకీ చెల్లించు.

లలి—మిక్కిన పదిరూపాయలూ ?

రాధా—ఎలా ఖర్చు చెయ్యటమనేగా నీ ఆలోచన!

లలి—పోనీలెండి. దాస్తాను.

రాధా—మరి—మీ రేంకొనుక్కో లేదేం—జమీందారిణిగారూ?

లలి—నాకా! నాకేం కావాలి లెండి.

రాధా—మొహమాట పడకండి.

లలి—నాయిష్టం వచ్చింది కొనుక్కోవచ్చా?

రాధా—మీచిత్తం.

లలి—మళ్ళీ కోప్పడరుగదా?

రాధా—కోప్పడను. సరా! సరే మరి - ఏం కొంటావో చెప్తావా?

లలి—నేనేదో కొనుక్కుంటాను; ఏమిటని అడక్కండి—బాగా ఆలోచించుకొని—ఏం?

రాధా—బాగాఆలోచించుకొని ఏదో వకటికొనుక్కుంటావ్—నాకు తెలుసు మిగుల్చుకుంటావా? యేమన్నానా!

లలి—మగవాళ్ళకు ఎంతచేసినా సంతృప్తి లేదు. నేనెంత మిగల్చగలనో అంతా మిగులుస్తూనేవుంటా.

రాధా—కాని "అది ఎంత?" అని మాత్రం అడగకూడదు. ఎన్నిసార్లన్నావ్ యీమాట.

లలి—అవును మరి—యీ పిచ్చికలగూడెం రాణిగారి ఖర్చు మీకేం తెలుసు.?

రాధా—అంతా సరిగ్గా మీ నాన్న పోలిక. ఎక్కడికి పోతుంది?

లలి—మానాన్న పోలికలు ఇంకా కొన్నివస్తే బాగుండును.

రాధా—పాపం! ఆయనపోయి అప్పుడే సంవత్సరం అయింది కాదూ.

లలి—సంవత్సరం అయిందా! అప్పుడే!!

రాధా—ఆ! సంవత్సరం. నాకు జబ్బుచేసి బెంగుళూరుకు వెళ్ళబోతుండగానేగా వుత్తరం వచ్చింది

లలి—ఆ! ఆవును క్రిందటి సంక్రాంతిపండుగముందు-పండగ మీజబ్బులోనే గడచిపోయింది.—ఎంత ఆదుర్దాపడ్డాం అప్పుడు! డాక్టర్‌గారు బలవంతాన పంపించారు.

రాధా—అలా పంపకపోతే ఎలావుండేదో?

లలి—వారిచలవే యిదంతా! ఎల్లుండి పండక్కి డాక్టర్ గారిని భోజనానికి పిలవండి.

రాధా—పిలుస్తా సరేగాని, ఆ వేళ పాడతానని అతన్నివూరిం చాన్-మరి వారు వ్రాసియిచ్చిన పాటకు స్వరం కట్టు కున్నావా?

లలి—ఇంకా లేదు. ఏదీ తీరిక?

రాధా—ఏదో తీరిక చేసుకోవాలిమరి; క్రిందటిసారి పండగల్లా పాడయిపోయింది. ఈతడవన్నా......

లలి—ఈతడవకేం? చక్కగా వుంటుంది పండుగ. ఇంతకంటే హాయిగా ఎప్పుడు వుంటాంకనక!

రాధా—జీవితం హాయిగా నడుస్తున్నప్పుడు పండుగలువస్తే బాగానే వుంటుంది. జ్ఞాపకంవుందా. క్రిందటిపండక్కి డబ్బుకోసం ఎంత యిబ్బందిపడ్డావో?

లలి—అవును.

రాధా—మీనాన్న సమయానికి పంపారు కాబట్టి సరిపోయింది—గాని......

లలి—అవన్నీ మర్చిపోవాలి. యిప్పుడు బ్రతికి బయటపడ్డాం. ఈ పిచ్చుకలగూడు కట్టుకున్నాం — ఇలాగడిచిపోతే, యిహ అనుకోవల్సింది లేదు.

[బయట తలుపుకొట్టినశబ్దం వినపిస్తుంది. రాధ వెళ్ళి తలుపుతీసి చూస్తాడు. "హల్లో డాక్టర్" అంటాడు]

డాక్టర్—(లోపలికివస్తూ లలితతో) మీకోసం ఎవరో వచ్చినట్లున్నారు.

లలి—నాకోసమా!

డాక్టర్—ఆ. మీకోసమే. ఆయాసపడ్తూ వస్తున్నారు.

రాధా—వెళ్ళిచూడు. మేం వెళ్ళి ఆఫీస్‌గదిలో మాట్లాడుతూ కూర్చుంటాం.

లలి—అల్లాగే.

రాధా—రా. డాక్టర్!

లలి—మరచిపోకండి. డాక్టర్‌గార్ని పండక్కి భోజనానికి పిలవండి.

రాధా—ఓ. అల్లాగే.

[ఇద్దరూ ఆఫీస్ గదిలోకి వెళ్తారు. లలిత బయట తలుపుతీసి శాంతను "లోపలికిరండి" అంటుంది. శాంత వస్తుంది—చేతిలో సూట్ కేస్‌తో]

శాంత—జ్ఞాపకం లేదు కాబోలు ?

లలి— లేదండి ! ఆ...ఉండండి నా మతి మండా...శాంత గాదూ (కౌగలించుకుంటుంది)

శాంత— నేనే.

లలి—ఎంత మారిపోయావ్-! గుర్తుపట్ట లేకుండా?

శాంత—అవును. చాలా మారాను-ఈ పదేళ్ళలో

లలి—ఎన్నాళ్ళకు మళ్లా కల్సుకున్నాం? పెళ్ళి అయింతర్వాత మళ్ళీ కల్సుకోనే లేదు.........అబ్బ—సరే. ఇదేనా రావటం?

శాంత—ఆ! ఇప్పుడే రైలుదిగి సరాసరి యిక్కడికే వచ్చాను.

లలిత—సరిగ్గా పండక్కి వచ్చావ్ చాలా చిక్కి పోయావే, నల్లబడిపోయావ్, మొహం వసిలి పోయింది-జీవితంలో పండి ముగ్గినట్లు.

శాంత—ఆ! ఆ! ఇంకా జీవితంలో పండి ముగ్గిపోక పోయినా కాస్త బుద్ధిమాత్రం వచ్చింది లే!

లలి—బుద్ధా! ఏమనుకోకు శాంతా! అసలు బుద్ధి లేన్ది నాకు.

శాంత—(తెల్లబోవటం చూచి) ఏమలా అయిపోయావ్ ?

లలి—పాపం......మీ ఆయన...

శాంత—అవును, విడిచి పెట్టేశారు.

లలి—నాకెవరో చెప్పారు. చాలా కాలమయింది కాదూ. ఆ రేళ్ళు...

శాంత—ఎనిమిదేళ్ళయింది.

లలి—ఉత్తరం రాద్దామనుకుంటే ఎప్పటికప్పుడు అలాగే పోయింది ఆ-పిల్లలా ఏమన్నా !

శాంత—పిల్లలు లేరూ ఎవరూ లేరు. చివరికి కన్నీళ్ళు కూడా లేవు.

లలి —అబ్బ! ఎంత బాధ పడ్డావో!

శాంత—అప్పుడప్పుడు అలా జరుగుతుంది లలితా. ఒకసారి వక తప్పటడుగు వేశామా-మళ్ళీ కాలుతీసుకోలేం. నాసంగతికేంలే............ఏకాకిని.

లలి—ఏకాకినంటావేం ? మీ అమ్మా.....తమ్ముళ్ళూ వున్నారుగా !

శాంత—మగడు విడచిపెట్టిన ఆడదాన్ని ఎవరు ఆదరిస్తారు- లలితా! టైపిస్టుగా వుద్యోగం చేసి తమ్ముళ్ళకీ చదువు చెప్పించాను. వాళ్ళకు రెక్కలు వచ్చి ఎగిరిపోయారు. మా అమ్మ నాల్గు నెలలక్రితం చనిపోయింది. నమ్మ తావో-లేదోగాని నన్ను తల్చుకుని యీ దౌర్భాగ్య జీవితంలో కొంత సంతృప్తి పడేదాన్ని. ఊ...పిల్లలు కులాసాగావున్నారా ?

లలి—ఆ.

శాంత—మీవారూ, కూడా...

లలి—కులాసాగానే వున్నారు. అదిగో ఆ గదిలో వున్నారు. వారి నీ మధ్య బ్యాంకు మానేజర్ గా వేశారులే. 250 రూపాయిలు జీతం.

శాంత—విన్నాను.

లలి—ఇహ డబ్బు యిబ్బంది వుండదు. యిష్టం వచ్చినట్లు ఖర్చు చేసుకోవచ్చు.

శాంత—నువ్వేం మారలేదు లలితా. ఒట్టి చిన్నపిల్లలా మాట్లాడుతున్నావ్. చిన్నప్పుడు బొమ్మల పెళ్ళిళ్ళాటలో గూడా యిష్టం వచ్చినట్లు ఖర్చుపెట్టేదానివి.

లలి—నీకింకా అవన్నీ జ్ఞాపకం వున్నాయిా?

శాంత—అవి తల్చుకోని రోజులేదు. ఎట్లా మర్చిపోతాం. అది బొమ్మలాట. ఇప్పుడు జీవితంలో ఆట. ఆ ఆటలు ఎంత బాగుండేవి! ఈ ఆట గూడా అలావుంటేనా.

లలి—అంత నిరుత్సాహం ఎందుకే! ఏవో కొన్ని వొడిదుడుకులు మాయింట్లోనూ జరిగేయి-కాని...

శాంత—కష్టాలు అందరికీ వస్తాయిలే......

లలి—క్రిందటి సంక్రాంతి-మా రెండో అమ్మాయి పుట్టిన క్రొత్తనెలలు. మావారికి పెద్ద జబ్బుచేసింది. ఆఫీసులో అదేపనిగా చాకిరీ చేశారులే. డాక్టర్ శేఖరంగారనీ మాకిక్కడ బాగాస్నేహితుడు-బెంగుళూరు తీసుకెళ్ళితే కాని వీల్లేదన్నారు. చేతిలో కానీలేదు. జీతం తక్కువ. చేతిలో "కానీ" లేకపోయినా వెళ్ళటం తప్పనిసరయింది. అల్లాగే వెళ్లాం. ఎల్లాగో డబ్బు సంపాదించి......

శాంత—అప్పు చేశారా?

లలి—అమ్మో! మావారు అప్పుచేయటమే! ఊళ్ళో ఛేబములన్నా చేయరు. బ్యాంకులో పనిచేసేవారు వూళ్లో

అప్పు చేయకూడదని రూలువుందిట. అసలు ఆ జబ్బు ప్రమాదమయిందని వారికి తెలియదు. వారికి చెప్పనే లేదు డాక్టర్‌గారు నా కొక్క దానికే చెప్పారు. నేనే లేవ్పెట్టి అదీ-యిదీ చెప్పి వప్పించాను-బెంగుళూరు వెళ్లేటానికి మూడు వేల రూపాయలయింది.

శాంత—అబ్బా! మూడు వేలే!!

లలి—మూడు వేలయింది. అంతా సంపాదించాల్సివచ్చింది నా అంతట నేను.

శాంత—నువ్వు సంపాదించావా? నువ్వు సంపాదించటమేమిటీ?

లలిత—అంటే-అదే మా నాన్న యిచ్చాడులే.

శాంత—అప్పట్లోనేగా ఆయనపోయింది?

లలిత—అప్పట్లోనే ఏమిటి? అప్పుడే వీరిజబ్బు. ఈ బెంగుళూరు వెళ్ళటం. దీంతో వెళ్ళి మా నాన్నని ఆఖరిసారి చూట్టానికి కూడా వీల్లేకపోయింది. ఏం చెయ్యను? వీరిని విడిచిపెట్టటానికి వీల్లేదుగా?

శాంత—అయితే చాలా జబ్బు చేసిందన్నమాట!

లలిత—ఆ, ''మామా-అల్లుళ్ళకి'' వక్కసారే వచ్చింది. చివ్వరికి తండ్రినే వదులుకొన్నాను.

శాంత—ఇప్పుడు మీవారికి బాగా నేవుందిగా?

లలిత—ఆ! పూర్తిగా నయమయింది.

శాంత—మరి డాక్టర్ గారెందుకు వచ్చారు?

లలి—ఏ డాక్టర్ !!

శాంత—ఇప్పుడు నాకు ముందుగా వచ్చారే లోపలికి.

లలి—ఓ డాక్టర్ శేఖరంగారా ! ఆయనకీ మూవారికీ బాగా స్నేహం. రోజూ వక్కసారన్నా వచ్చివెళ్తారు. నూవా రున్నాసరే – లేకపోయినాసరే. వచ్చి పిల్లల్నీ నన్నూ చూచి, కాసేపు మాట్లాడి మరీ వెళ్తారు. ఇంకా పెళ్ళి గిళ్ళీ కాలేదు. సరే దీనికేంలే ! నీసంగతి చెప్పూ ?

శాంత—నాసంగతేముందిలే, నాకు జీవితంలో ఒక ఆశయం లేదు. నిన్నూ నీ పిల్లల్నీ చూసి సంతృప్తి పడదామని వచ్చాను.

లలి—అయితే యిక్కడే వుండిపోతావా ?

శాంత—ఆ ! ఏదో వుద్యోగం చూచుకొని వుంటాను.

లలి—మూవారి బ్యాంకీలో వుద్యోగంవుంటుందేమో ప్రయత్నించమంటావా ?

శాంత—అంతకంటేనా ! "టైప్ రైటింగ్ – బుక్ కీపింగ్" రెండింటిల్లోనూ అనుభవం వుందినాకు.

లలి—ఇక తక్కిన సంగతులు నాకు వదిలెయ్యి. నీకు ఉద్యోగము వచ్చినట్టే.

(బయట పిల్లలగోల తలుపుకొట్టిన శబ్దం)

లలి—అబ్బబ్బ ! ఏమిటాగోల.

శాంత—ఎవరది ?

లలి—ఇంకెవరు ! పిల్లలు వచ్చారు కాబోలు. వాళ్ళ నాన్న గారు యింట్లో వున్నారని తెలియదు.

[వెళ్ళి తలుపుతీసి పిల్లల్ని (ఒకమగపిల్లవాడూ ఒక ఆడపిల్ల) లోపలికి తీసుకవస్తుంది]

లలి—మీనాన్నగారు ఆగదిలో వున్నారు. అల్లరిచేయకండి.

శాంత—ఎంత అల్లరిచేసినా నిన్ను మించిపోరు లే!

లలి—అల్లా అనుకుంటున్నావ్ కాబోలు. వాళ్ళనాన్నగార్ని అటువెళ్ళనీ, పట్టపగ్గాలుండవ్.

శాంత—(ఒక పిల్లాణ్ణిదగ్గరకు తీసుకుని) నీ పేరేమిట్రా ?

లలి—అశోక్ ఏడుపుగొట్టు వెధవ. దీని పేరు సావిత్రి-వెధవ మొండితనం ఇదీనూ.

శాంత—వాళ్ళ నెందుకు తిడతావ్. అంతా నీ పెంపకంలో వుంటుంది.

లలి—వాళ్ళ నాన్నగారి ఉపన్యాసం నువ్వూ మొదలెట్టావేం? ఆగు వీళ్ళని దొడ్లో దించి వస్తా. ఆడుకుంటారు. (వెళ్లి దించి వస్తుంది)

శాంత—లలితా! అంతా బాగానేవుందిగాని. పిల్లలకు ఆ గుడ్డలేమిటి? కాస్త వాళ్ళ తిండి గుడ్డా విషయంలో శ్రద్ధ తీసుకోకపోతే ఎట్లా.

లలి—అవును చిరిగినగుడ్డల్తో నే ఆడుకోవటానికి వెళ్లారు.

శాంత—బ్యాంకు మానేజర్ గారి పిల్లలేమిటి! ఆ గుడ్డలేమిటి!

లలి—అవును కానీ......

శాంత—కానీ-ఏమిటి-కాని!

లలి—అసలుసంగతి నీకు తెలియదు శాంతా, అదంతావింటే ఆశ్చర్యపోతావ్.

శాంత—అసలుసంగతా?

లలి—నే ననుభవించిందంతా సుఖమేనని, కష్టాలసంగతే తెలియదనీ అనుకుంటున్నావు కాబోలు.

శాంత—ప్రపంచంలో ఎవరికి వారికి అల్లాగే అనిపిస్తుంది.

లలి—కాని నేనింతవరకూ అనుభవించిందంతా కష్టమే.

శాంత—ఇప్పుడేగా! అంతా చెప్పావ్.

లలి—కాని అసలుసంగతి చెప్పనేలేదు.

శాంత—అసలుసంగతా?

లలి—నేనంటే నీకు లోకువ! అమ్మకోసం తమ్ముళ్ళకోసం నువ్వే-పెద్ద త్యాగంచేశానని నీకు గర్వం.

శాంత—నేనదేం గొప్పగా అనుకోనడంలేదుగాని, గర్వపడటానికి నాకు కాస్తన్నా అధికారం లేదంటావా?

లలి—నా జీవితంలోనూ కాస్తగర్వపడటానికి కొంత వుందంటాను.

శాంత—ఉండవచ్చు-కాని-నేనది వినవచ్చా?

లలి—ఆ,-వినచ్చు కాని అది వకరహస్యం. మావారికి వినిపించకూడదు. అసలుసంగతి ఆయనప్రాణాలు రక్షించింది నేను.

శాంత—రక్షించటమా!

లలి—బెంగుళూరువెళ్ళినసంగతి చెప్పేగా?

శాంత—అవును. మీనాన్నగారు డబ్బు యిస్తే...

లలి— లేదు. ఆ నగలన్నీ నేనే సంపాదించాను.

శాంత—ఎలా?

లలి— అదే రహస్యం.

శాంత—నువ్వేం అప్పు గిప్పూ చేయలేదుగదా?

లలి—ఏం చెయ్యకూడదా?

శాంత—మీ ఆయనకు తెలియకుండా అప్పు చెయ్యడమా? సరి తీర్చడం......ఎట్లా!

లలి—అదే తెలివి! డబ్బు సంపాదించగల భార్య అయితే సరి.

శాంత—నాకర్థమవటం లేదు.

లలి—నే నప్పు చేశానని లేదే! ఏవిధంగానైనా రావచ్చు. ఇంత అందమైనదాన్ని నా కెవ్వరివ్వరు డబ్బా?

శాంత—ఏం పిచ్చిదానవా లలితా! అంత బుద్ధితక్కువా?

లలి—బుద్ధితక్కువా! మగణ్ణి బ్రతికించుకోవడం బుద్ధి తక్కువా?

శాంత—కాని ఆయనకు తెలియకుండా......

లలి—తెలియకూడదు. తెలిస్తే ఆయన ప్రాణం వుండగా ఒప్పుకోరు. ఒప్పుకోకపోతే ప్రాణాపాయం. డాక్టరుగారదే అన్నారు. వారికది తెలియకూడదు. అందుచేతే యీపని చేశాను.

శాంత—మీనాన్న మీరా ఆయనతో చెప్పలేదూ - తను డబ్బివ్వలేదని!!

లలి—అప్పుడేగా ఆయన పోయారు! ఆయనతో అంతా తర్వాత చెప్తా ఉత్తరం రాద్దామనుకున్నా కాని అవసరం రాకుండానే పోయారు.

శాంత—ఇప్పటివరకూ యీ రహస్యం మీ ఆయనకు తెలియదూ?

లలి—ఆయనకు తెలిస్తే యింకేమన్నా వుందా!

శాంత—అయితే చెప్పదల్చుకోలేదా?

లలి—ఏమో! చెపుతానేమో ఎప్పుడన్నా. కాని ఆరోజు రానేరాదు. అప్పట్నుంచీ యీ "బాకీ" వాయిదాల ప్రకారం తీర్చేస్తున్నాలే! తీర్చలేక నా తలప్రాణం తోకకి వస్తున్నది. ఇంటి ఖర్చులో మిగిల్చి, అన్నివిధాలా డబ్బు కూడబెట్టి వాయిదా వేళకి డబ్బుకడుతున్నా—గాని ఈ తక్కువ జీతంలో ఎంత మిగిలిస్తే అవుతుంది. అలాగే నానా అవస్థపడుతున్నా వాళ్ళకి సరిగ్గా గుడ్డలన్నా కొనటంలేదు.

శాంత—ఖర్చులో మిగులుస్తున్నావన్నమాట. పాపం.

లలి—ఆ! అంతే. (తలుపుకొట్టినశబ్దం)

శాంత—ఎవరో వస్తున్నట్లున్నారు. (లలిత తలుపుదగ్గర కెళ్ళి చూసి) మీరా! ఎందుకొచ్చారూ?

[నారాయణయ్య ప్రవేశించి]

నారా—మన అయ్యగారికోసం వచ్చాన్లెండీ. కొంచెం మాట్లాడాలి...

లలి——ఆఫీసుగదిలో వున్నారు వెళ్ళండి. ఇటు వెళ్ళవచ్చు. వెళ్ళండి.

(ఆమాటవిని శాంత రెండవప్రక్కకు వెళ్తుంది. నారాయణయ్య ఆఫీసుగదిలోకి వెళ్తూ...)

నారా——శాస్త్ర అర్జంటుగా మాట్లాడవల్సి వచ్చిందండీ. ఆదివారమయినా పనిచేయక తప్పదూ, అధికార్లను కల్సుకోక తప్పదు-చూబోటివాళ్ళకి. వస్తా.

(నారాయణయ్య ఆఫీసుగదిలోకి వెళ్ళిన తర్వాత)

శాంత——ఎవరాయన లలిత ?

లలి——"నారాయణయ్య" అని-బ్యాంకులో గుమాస్తా.

శాంత——నారాయణయ్యా ! !

లలి——ఆ. నీకు తెలుసా ?

శాంత——ఆ. ఆ. నాతో చదువుకున్నాడు లే...చాలా మారిపోయాడు!

లలి——చాలామంది పిల్లలు-పాపం ! ఆమధ్యనే భార్యకూడా పోయిందిట.

శాంత——ఏమిటో ! సంసారాలు.

శేఖరం——(ఆఫీసుగది ద్వారంద్వారా వస్తూ ఆఫీసుగదిలోవున్న రాధతో)అబ్బే నీపనిచూసుకో. నీపని పాడవటం దేనికి. ఫర్వాలేదు. నేను పిల్లల్ని చూశి వెళతా" (వెనక్కితిరిగి లలితను చూచి) మీరింకా మాట్లాడుతున్నట్టున్నారే]

లలి——ఫర్వాలేదు. రండి. ఈమె నా బాల్యస్నేహితురాలు. వీరే మాడాక్టర్ చంద్రశేఖరంగారు.

చం. శే.—చాలా సంతోషం. మీరేగా మెట్లదగ్గర కన్పించింది. అంత ఆయాసపడ్తూ ఎక్కారే మెట్లు!

శాంత—మరేనండీ, మెట్లుకాస్త మెల్లిగా ఎక్కాలి. గబగబా ఎక్కితే ఆయాసంగా వుంటుంది.

చం. శే.—కొన్నాళ్ళు విశ్రాంతిగా కాలం గడపటానికి వచ్చారా యిక్కడికి.

శాంత—లేదండి! ఏమైనా వుద్యోగంకోసం వచ్చాను.

చం. శే.—అదేమిటి? ఉద్యోగం చేస్తే ఆయాసం ఎక్కువవుతుందిగాని తగ్గదే!

శాంత—అలసటకోర్చుకోవాలీ అంటే ముందు బ్రతకాలి గదండీ- ఎలాగో అలా!

చం. శే.—అవును చాలామంది అలాగేఅనుకుంటారు. 'తాము బ్రతకటం చాలా అవసరమని'

లలి—మరి చావటం అవసరమంటారా యేం, మీరు?

చం. శే.—అనేఅంటాను. మనసంగతిసరే, అలావుంచండి. నీతి జాతీ లేకుండాతిరిగి వ్యాధులతో బాధపడేవాళ్ళు గూడా అదేమాట అంటారు మీఆయనతో మాట్లాడుతున్నాడే ఆ నారాయణయ్య ... ... అతనూ అదేమాట.

శాంత—పాపం!

లలిత—అహా! అతనా?

చం. శే.—అతని సంగతి మీకు తెలియదులెండి. అతనుకూడా బ్రతకడం అవసరమనే మొదలు పెట్టాడు.

లలి—అట్లాగా ! ఏం పనిమీద వచ్చాడో ?

చం—ఏదో వాళ్ళ ఆఫీసు విషయాలు. ఈరోజుల్లో మోస గాళ్ల చేతుల్లో వుద్యోగాలుంచి మంచివాళ్ళ చేతుల్లో ముష్టి చెంబు వుంచుతున్నారు.

శాంత—అటువంటి వారిని తిట్టిపొయ్యటంకంటె జాలిపడి సంస్కరించటం మంచిదేమొ!

చం. శే—ఆ! జాలి దయ. ఈ రెండూ కలిసి మన సంఘాన్ని ఒక ఆస్పత్రి క్రింద మార్చివేస్తున్నాయి. నీతిలేకుండా ప్రవర్తించి చేసిన పాపాన్ని అనుభవిస్తున్న వాడి మీద జాలి ఎందుకు చూపాలి ? దొంగతనం చేసి పట్టుబడిన వాడిని ఎముకలు విరగగొట్టకుండా దయజూపి వదలటం ఎందుకూ ? నేను మీ ఆయన కెప్పుడో చెప్పాను. తనకి చేతనయితే ఇతన్ని బ్యాంక్‌లోంచి తీసి పారెయ్యమని; అటువంటి వాడసలు మన సంఘంలోనే పనికిరాడు. (లలిత పరధ్యానంగా నవ్వుతుంది)

చం. శే—నవ్వుతారేం ? సంఘమంటే ఏమిటో తెల్సినట్టు !

లలి— సంఘమంటే ఏదయితే నాకేం ! దానిక్కాదు నే నవ్వింది. మావారికి ఆఫీసులో అంత అధికారం వుంది గదా అని......

చం. శే—బాగుంది ! అందుకా! నేనింత చెప్తే......

[రాధా కృష్ణ వస్తాడు]

లలి—(భర్తతో) ఈవిడ మాస్నేహితురాలు. శాంత.

శాంత—నమస్కారమండీ.

రాధా—నమస్కారం...బాల్యస్నేహం అయివుంటుంది. ఎప్పుడూ చూడలేదు.

లలి—పాపం. చాలా యిబ్బందుల్లో వుంది మీతో మాట్లాడాలని చాలా దూరాన్నుంచి వచ్చింది.

రాధా—నాతోనా...!!

శాంత—నేనూ......

లలి—ఆ. బి. ఎ. ప్యాస్ అయింది. టైప్ రైటింగ్. బుక్ కీపింగ్ తెలుసు. మీకు బ్యాంక్ మానేజరు వుద్యోగం అయిందని తెలిసి పరుగెత్తుకు వచ్చింది.

రాధా—కానీ-చూద్దాం. నీ రికమెండేషన్‌కి తిరుగువుందా?

లలి—(శాంతతో) నే నేం చెప్పాను?

రాధా—(శాంతతో) మీకు ఎకౌంట్సులో బాగా అనుభవం వుందా?

శాంత—ఆ! కొన్నాళ్ళు పనిచేశాను.

రాధా—అయితే యిదేమంత కష్టంగాదు. మంచి సమయానికి వచ్చారనే అనాలి. రెండుమూడురోజుల్లో ఏదో ఎరేంజి చేద్దాంలెండి. నేనట్లా వెళ్ళిరావాలి. లలితా! తొందరగానే వస్తాలే...వస్తావా డాక్టర్. నేనూ అందాకా వస్తాను.

చం. శే—ఓ... పద.

లలి—ఆలస్యం చెయ్యకండి.

చం. శే—పిల్లలు కనపడలేదేం యివ్వాళ?

లలి—దొడ్లో ఆడుకోటానికి వెళ్ళారు.

చం. శే—దొడ్లోకివెళ్ళి వాళ్ళనుగూడా తీసుకుపోదాం.

రాధా—ఆ- వాళ్ళుకూడా ఎందుకూ అనవసరంగా ?

చం—రావయ్యా (రాధాకృష్ణయ్యను దొడ్డివైపుకు లాక్కుపోబోగా)

లలి—ఇదిగో... పండుగ రెండురోజులూ డాక్టర్ గార్ని భోజనాన్కి ...

రాధా—పిల్చాలే - ఎన్నిసార్లు చెప్తావ్ ! నీకా పాట సంగతి జ్ఞాపకం వుందా!

లలి—జ్ఞాపకం వుంది, ఇవ్వాళే స్వరం కట్టుకుంటాను.

రాధా—సరే వస్తాం - (వెళతారు)

శాంత—నేనూ వెళ్ళివస్తా లలితా !

లలి—ఎక్కడికీ ?

శాంత—ఉంటానికి గదీ, అదీ, చూసుకోవద్దూ ?

లలి—చాల్లే. ఎక్కడికీ వెళ్ళక్కర్లేదు. మాయింట్లోనే వుండు.

శాంత—బాగుంది. ఇదికూడానా ; వద్దులే.

లలి—వీల్లేదూ ... వీల్లేదూ వీల్లేదు. పద లోపలికి. ఆజ్ఞాపిస్తున్నది ఎవ్వరో తెలుసా ! కాబోయే బ్యాంక్ మేనేజరుగారి భార్య ... ... (నవ్వుతూ యిద్దరూ లోపలికి వెళతారు)

( తెర )

——

## రెండవ రంగము

[భోగి పండుగనాడు. అదే గదిలో–లలిత బొమ్మలు పెడ్తోంది. పిల్లలు, శాంత, లలిత చూస్తుంటారు]

లలి—ఈ బొమ్మలు కొత్తగా కొన్నాను.

శాంత—ఎంతయినవి?

లలి—ఎంతలే, పదిహాపాయిలు. బాగుండలేదూ సెట్టు? ఇదిగో పెళ్ళికొడుకు పెళ్ళికూతురు వియ్యాపురాలు వియ్యంకుడు పెళ్ళివారూ. (అంటూ బొమ్మలు చూపిస్తుంటే పెళ్ళి కొడుకుబొమ్మ మొహాన లలితకున్న చేతి రంగయింది.)

లలి—అరే—.

శాంత—ఏమిటి?

లలి—ఈ బొమ్మ మొహానికి రంగయిందే!

శాంత—రంగు వేసిన చేత్తో ముట్టుకుంటే రంగవదూ!

లలి—(తుడిచి) పోవటంలేదు.

శాంత—అది ఇక పోదు. వీళ్ళకింకా అన్నాలు పెట్టలేదుగా

లలి—లేదు

శాంత—నే పెడ్తాలే; నువ్వు బొమ్మలు సర్దు. రండర్రా.

(శాంత పిల్లల్ని తీసుకుపోతుంది. లలిత బొమ్మలు తుడవటానికి ప్రయత్నిస్తుంది)

[ నారాయణయ్య ప్రవేశం ]

నారా—క్షమించాలి, ఒకమాట చెప్పటానికి వచ్చాను.

లలి—ఏమిటది?

నారా—వాకిటి తలుపు తీసేవుంది, వెయ్యటంమర్చిపోయారు కాబోలు.

లలి—ఉంటేవుంది, మావారిప్పుడే ఎక్కడికో వెళ్ళారు. పని వుంటే మీరు తర్వాతరండి.

నారా—లేరని తెల్సు. మీవారు బయటకు వెళ్ళటం చూశే నేఇట్లా లోపలికి వచ్చాను... నేను మీతో మాట్లాడదామనే వచ్చానండి.

లలి—నాతోనా! నేను బ్యాంక్ డబ్బు కట్టటానికి వాయిదా టైం కాలేదుగా.

నారా—అబ్బే! దానివిషయం కాదండి. మీరిప్పుడప్పుడే డబ్బు కట్టక్కర్లేదు. మీ వాయిదాటైం అవలేదు. కాని ఒక్క నిమిషంకూర్చోండి చెప్తాను.

లలి—త్వరగా తేల్చండి.

నారా—నేను నిన్నకూడా మీయింటికి వచ్చాను.

లలి—అయితే!

నారా—అప్పుడో కొత్తావిడ మీతోకూడావుంది.

లలి—వుంటే—?

నారా—మరేంలేదు. ఆవిడపేరు! 'శాంత' గాదూ?

లలి—అవును. అయితే?

నారా—ఆమె నిన్ననే వచ్చినట్టుంది.

లలి—ఏమిటీ 'క్రాస్ ఎగ్జామినేషన్'

నారా—ఏంలేదు. ఆవిడ నాకూ తెలుసులెండి.

లలి—అని నాకు తెల్సు.

నారా—అయితే చెప్పండి ఆమెకు బ్యాంకులో వుద్యోగం యిస్తారా?

లలి—అది ఆఫీసర్ గారి యిష్టం.

నారా—అవునుగాని... ఆఫీసర్లు చాలామంది భార్యల చేతుల్లో కీలుబొమ్మల్లాగ వుంటారు.

లలి—నారాయణయ్యగారూ! మీయిష్టంవచ్చినట్లు మాట్లాడానికా యిక్కడికి వచ్చింది?

నారా—అయితే నే ననుకొన్నది నిజమే నన్నమాట.

లలి—ఆ నిజమే, ముమ్మాటికీ నిజం. శాంతకి వుద్యోగం యిస్తారు. ఇప్పించిందికూడా నేనే. ఇక మీరు వెళ్ళండి.

నారా—హూ...

లలి—ఆడవాళ్ళకి అక్కడక్కడ కాస్త భర్తలమీద పలుకుబడి వుంటుంది. క్రిందవుద్యోగస్థులు, వాళ్ళకు కోపం తెప్పించటం, ఏకవిధంగా, నష్టంకూడా.

నారా—లలితమ్మగారూ! మీపలుకుబడి కాస్త నాతరఫున ఉపయోగించాలి.

లలి—అంటే మీవుద్దేశ్యం?

నారా—నా ఉద్యోగం వూడకుండా మీరు చూడాలి.

లలి—మీ ఉద్యోగం నే నేం వూడగొట్టటంలేదు.

నారా—ఈనాటకం యింతటితో కట్టిపెట్టండి. రేపో ఎల్లుండో నా ద్యోగం వూడటానికి సిద్ధంగావుంది. ఊడితే దానికి మీరే అడ్డపడి, ఊడకుండా చూడాలి.

లలి—దానికీ-నాకూ-సంబంధమేమిటి ?

నారా—శాంతకు వుద్యోగం యివ్వడంలో మీకెంత సంబంధమో, దీనికి అంతే. నా "పోస్టే" శాంతకు యివ్వబోతున్నారు.

లలి—ఇస్తున్నారేమో! కాని యీపని నావల్లకాదు,—నే చెయ్యలేను.

నారా—మీవల్ల అవుతుంది. మీ చేత నేను చేయించగలను.

లలి—ఏమిటీ బలవంతం ?

నారా—ఆ! బలవంతమే-అనేక కారణాలవల్ల నాజీవితం నాశనమైపోయింది. తిరిగి యీ చిన్న వుద్యోగంకూడా వూడితే, మళ్ళీ కోలుకోలేను. నా భవిష్యత్తూ నాపిల్లల భవిష్యత్తూ అంతా దీనిమీదే ఆధారపడివుంది. అందుకనే బలవంతానైనా దీనికి మిమ్మల్ని అడ్డుపెట్టక తప్పదు. తప్పటంలేదు.

లలి—నాకిష్టంలేనిపని, నాచేత చేయించగలరనే!

నారా—చేయించగల ధైర్యం వుందిగనకనే మీదగ్గరకు వచ్చాను.

లలి—చాలా గొప్పధైర్యం!

నారా—నాధైర్యమేమిటో-సహజంగా మీకూ తెల్సేవుండాలి. మీ ఆయనగారు నన్నిప్పుడు అధః పాతాళంలోకి తొక్కేస్తున్నారు. నాజీవితం నాశనమైపోతుంటే ప్రతి

తనవా చూస్తూ వూరుకోలేను. నా చేతనయినంతవరకూ జాగ్రత్తపడతాను. మీవారికి తెలియకూడని రహస్య మొకటి నాచేతిలో వుంది. దానిసంగతి జ్ఞాపకం తెచ్చుకోండి

లలి—రహస్యం! దానిసంగతి చెప్పేస్తానంటూరా ఏమిటి?

నారా—చెప్తాను-అవసరమైతే.—

లలి—అది తెలిస్తే—ఆయన - - (ఆగి) మా యింట్లో ఎంతగోల అవుతుందో తెలుసా?

నారా—ఒక్క యింట్లోనే వుండిపోతుందా! ఈగోలంతా వాడవాడలకీ పల్లె-పల్లెలకీ పాకుతుంది.

లలి—ఊఁ!! ఫర్వాలేదు. చెప్పండి. బ్యాంకులోన్ తీర్చుకోలేనంత దౌర్భాగ్యస్థితిలో లేం మేము.

నారా—అహా! అయితే నేననుకున్నది నిజమే. మీపరిస్థితి మీకు తెలియదన్నమాట. లేకపోతే వ్యవహారం సరిగా అర్థంకాలేదో. నేనన్నీ ఒక్కసారిగా చెప్తాను వినండి.

లలి—ఏమిటది?

నారా—మీవారికి క్రిందటి ఏడు జబ్బుచేసింది. జ్ఞాపకముందిగా. బెంగుళూరుపోవటానికి మీరు డబ్బుకు చాలా యిబ్బందిపడ్డారు. డబ్బు రహస్యంగా మీవారికూడ తెలియకుండా సంపాదించవల్సి వచ్చింది. అప్పుడు మీరు డబ్బుకు బ్యాంకులో నాదగ్గరకు వచ్చారు అవునా?

లలి—అవును. నాకింకెవరూ తెల్సినవాళ్ళులేక మీదగ్గరకొచ్చాను.

నారా— నేను బ్యాంక్‌లో మీకు "లోన్" యిప్పించాను— వాయిదాలు వాయిదాలుగా తీర్చుకునే పద్ధతిమీద.

లలి—అవును.

నారా—బ్యాంకులో అప్లికేషన్ ఫారంలోనూ బ్యాంకు లోనూ మీరు సంతకం చేశారు.

లలి—అలాగే ప్రతినెలా డబ్బుకడుతూనే వున్నానుగా?

నారా—కడుతున్నారుగాని—అది కాదు – అసలు సంగతి. ఆ అప్పు మీనాన్నగారి జామీను మీద బ్యాంకువారు యిచ్చారు.

లలి—అవునూ......

నారా—దాని మీద మీ నాన్నగారు జామీను సంతకం పెట్టి వుండాల్సింది.

లలి—నాన్నగారు సంతకం పెట్టారుగా!

నారా—ఆ మీనాన్నగారే సంతకం పెట్టారు లెండి. కాని అప్పుడు మీరేదో పెద్ద ఇరుకున పడివున్నట్టున్నారు

లలి—ఇరుకంటే!

నారా—అప్పుడే మీనాన్నగారికి కూడా జబ్బుచేసినట్టుంది.

లలి—అవును—ఆజబ్బులోనే.......

నారా—ఆయన చనిపోయారు. ఆ చనిపోయింది ఏ తారీఖునో మీకు జ్ఞాపకముందా?

లలి—బాగా జ్ఞాపకంలేదు.

నారా—నే నది వాకబు చేసే వచ్చాను. డెత్ రిజిష్టర్ ప్రకారం జనవరి 5 వ తేదీన చనిపోయారు. చూడండి. ఈ తేదీలలోనే కాస్త తంటా వచ్చింది.

లలి__తంటా ఏమిటి?

నారా___మరేంలేదు కాని, (కాగితాలు చూపిస్తూ) ఈ బ్యాంకులో మీ రిచ్చిన జామీను కాగితం మీద జనవరి 8 వ తేదీన మీ నాన్నగారు. సంతకం పెట్టారు.

లలి___అయితే!

నారా___అంటే ఏం లేదు. జనవరి 5 వ తేదీన పోయిన మీనాన్నగారు జనవరి 8 వ తేదీన జామీనంటూ సంతకం చేశారు, పైగా తారీఖు వేసిన దస్తూరికీ, సంతకం దస్తూరికీ భేదం వుంది. అసలు మీ నాన్నగారు సంతకం చెయ్యలేదు. సంతకం చేసింది ఎవరో నాకు తెలుసు.

లలి___నాకూ తెలుసు. అవును నేనే చేశాను-మా నాన్నగారి సంతకం.

నారా__ఆమాటలో వున్న ప్రమాదం తెలిసే అంటున్నారా?

లలి___ప్రమాద మేముంది? ఎప్పటి డబ్బు అప్పుడు మీకు కట్టేస్తున్నానుగా!

నారా___అసలు ఆకాగితం మీనాన్నగారికి ఎందుకు పంప లేదూ.

లలి___ఎలా పంపను? ఆయ నప్పుడు చావు బ్రతుకుల మీద వుంటే-అల్లుడికి జబ్బుగావుందని చెప్పకుండా __

నారా___అయితే బెంగుళూరు ప్రయాణం మానుకోవల్సింది.

లలి___మానుకుంటే మావారికి నయంగాదు.

నారా—అందుకని నన్నూ, బ్యాంకునూ మోసగిస్తారా?

లలి—మిమ్మల్ని గురించి నేనాలోచించనే లేదు.

నారా—మీ కింకా చేసిన పని అర్థంకా లేదా ఏమిటి! నే నిదివరకు నా పరువు ప్రతిష్ఠలు పోగొట్టుకోటానికి ఏం పాడుపని చేశానో-అపనే మీరూ చేశారు.

లలి—మీరా! మీరు మీ భార్య ఆరోగ్యం కోసమే ఆ పని చేశానని గట్టిగా చెప్పగలరా?

నారా—మన కిప్పుడున్న చట్టాలకు పవిత్రోద్దేశ్యాలతో నిమిత్తం లేదు.

లలి—అయితే దాన్ని పశువుల చట్టం అంటే మంచిది.

నారా—కావచ్చుగాని ఆ చట్టప్రకారమే మీరు చేసిన ఫోర్జరీ కేసు విచారణ జరుగుతుంది.

లలి—ఏం? నాతండ్రికి జబ్బుగా వుంటే ఆయనకు విచారం కల్గించకుండా వుండటానికి-కూతురికి-నా కధికారం లేదూ? చట్టంలో యిదివరకా అధికారం లేకపోతే యిహ నన్నా కల్గించటం మంచిది.

నారా—అలాకల్గించటానికి నేనెవరిని? కాని యిదిమాత్రం జ్ఞాపకంవుంచుకోండి ఈసారి నా ఉద్యోగంపోతే మీ పరువు మాత్రం దక్కదు. (వెళ్ళిపోతాడు)

(లలిత తెల్లబోయి విచారంగా బొమ్మలదగ్గర కూర్చుంటుంది. మచ్చబడ్డ బొమ్మనుతీసి, తుడుస్తూ నారాయణయ్య వెళ్ళిన ద్వారంవంకే చూస్తూ అంటుంది)

లలి—బెదరింపులు— బెదరింపులు—

[ కాసేపటికి బయటనుంచి రాధాకృష్ణ లోపలికి వస్తాడు ]

రాధా—ఓహో! రామచిలుక బొమ్మలు పెట్టేశిందే. అప్పుడే! పండుగ హడావిడి ప్రారంభమయినదన్నమాటే! (లలిత ముఖంకి వలిక చూసి) అదేమిటి అట్లావున్నావ్ !

లలి—ఏం లేదు.

రాధా— (లలిత చేతిలో బొమ్మ మొహానవున్న రంగుచూశి) ఇదేమిటి! బొమ్మ మొహాన రంగు పూశావ్.

లలి—గుమ్మాలకు వేసినరంగు చేతికంటింది గాబోలు. చూచుకోలేదు. చేతిరంగు బొమ్మలకు అంటింది. ఎంత తుడిచినా మచ్చపోవటం లే!

రాధా—ఒకసారి మచ్చపడిన తర్వాత పోవటంకష్టం.

లలి—మరీ అసహ్యంగా కనిపిస్తోంది కాదూ?

రాధా—లాభం లేదు. అసహ్యంగా వుంది. ఆ బొమ్మను కొలువులో పెట్టకు

లలి—మరి పారెయ్యాల్సిందే.

రాధా—ఆ, దూరంగా పారెయ్యాలి. సరేగాని యిప్పుడెవరన్నా నా కోసం వచ్చారా?

లలి—లేదే!

రాధా—అహ నారాయణయ్య గేటుదగ్గర కనిపించాడూ! లోపలికి రాలేదూ?

లలి—ఆ! నారాయణయ్యా! వచ్చాడు.

రాధా—ఆ! వచ్చి...తనగురించి ఏమైనా చెప్పారున్నాడా.

లలి—ఆ! చెప్పాడు.

రాధా—తనువచ్చిన సంగతి చెప్పొద్దని కూడా అన్నాడా ఏమిటి ?

లలి—అన్నాడు.

రాధా—లలితా! ఆఫీసు విషయాల్లో మాత్రం నువ్వేమీ దాక్షిణ్యం కలుగజేసుకోవద్దు

లలి—అల్లాగే.

రాధా—వెధవ! వెధవపనులు చేసేదిన్నీ...

లలి—వెధవపనా!

రాధా—వెధవన్నర వెధవపని. "ఫోర్జరీ" ఫోర్జరీ అంటే అర్థం తెల్సా ?

లలి—తెలుస్తోంది. పాపం ఏదో అవసరంకొద్దీ చేశాడేమో?

రాధా—అవసరమో, అనవసరమో "చట్టాని"కా దాక్షిణ్యం-కనికరం వుండవు. తప్పుచేసినవాడు శిక్ష అనుభవించాల్సిందే.

లలి—శిక్షా!

రాధా—తప్పుచేసి-శిక్ష తప్పించుకోవాలనేవాడు బాగు పడడు. అందుకే నారాయణయ్యా నాశనమయ్యాడు. జీవితంలో తప్పులు అందరూ చేస్తారు. వాటిని కప్పి పుచ్చటానికి ప్రయత్నించ కూడదు. వాటిని సర్దుకోవాలి.

ఆ ధైర్యం లేనివాడు తన్నే గాదు - తన సంసారాన్నీ - పిల్లల్నీ - అందర్నీ - నాశనం చేస్తాడు. అందులోనూ పిల్లల్ని, ముఖ్యంగా పిల్లల్ని.

లలి—పిల్లల్నా ! !

రాధా—ఆ! పిల్లల్ని, ప్రపంచాన్ని మోసంచేసేవాడు తన సంసారాన్ని మోసమే చేస్తాడు. దొంగమాటలు కృత్రిమ ప్రవర్తన పిల్లలకు నూరిపోస్తాడు. మంచిచెడ్డలు తెలియని పసివాళ్ళ మెదడు కిట్లాంటివి బాగా నాటుకుంటాయి. వాళ్ళూ చివరకు తండ్రిలాగే తయారవుతారు. ఈ విషయాల్లో తల్లీ తండ్రీ కూడా అంతే. తల్లి అయితే మరీ అన్యాయమే మొ.

లలి—తల్లి అయితే మరీ అన్యాయమా ?

రాధా—ఆఁ, పిల్లలమీద తండ్రిప్రవర్తనకంటే తల్లిప్రవర్తన బాగానాటుతుంది. ఈబొమ్మలెంతో పిల్లలూ అంతే. ఈబొమ్మలు నువ్వెక్కడపెడితే అక్కడే వుంటాయి. తుడిచి శుభ్రంగా వుంచితే, అందంగావుంటాయి. మూల పారేస్తే మాసిపోతాయి. క్రిందపడేస్తే బద్దలవుతాయి. పిల్లలుకూడా అంతే! ఈ బొమ్మమొహాన ఎర్రరంగు పూశావు-పొరపాటనే అనుకో-కాని, పొరపాటైనా రంగు పోగొట్టగలిగామా ? అల్లాగే పిల్లల ప్రవర్తనకూడా. పొరపాటుగానైనా చెడగొడితే, ఇహ పిల్లల్ని బాగు చెయ్యలేం. అందుకనే, పిల్లల బాగోగులకి తల్లిదండ్రులు

బాధ్యులు. తల్లితండ్రులు చెడిపోవటం ఒకటైతే - పిల్లల భావిజీవితాన్ని చెడగొట్టటం వేరొకటి. అందుకని ఈ నారాయణయ్యలు సంఘంలోనికి పనికిరారు. వీళ్ళమీద దయదాక్షిణ్యంగూడా చూపగూడదు. కనకే నా "కిన్నెరసాని" నారాయణయ్యనుగురించి నాతో ఏమీా చెప్పగూడదు.

లలి—అబ్బ. ఇవ్వాళ యింత ఉక్రోషంగావుందేం!

రాధా—ఇటువంటి వెధవతో నేను ఆఫీసులో పనిచెయ్యటమే కష్టంగావుంది. అందుకనివాణ్ణి "డిస్‌మిస్" చేస్తూ కాగితం పంపేశాను.

లలి—(ఖంగారుపడుతూ లేచి వెళ్ళబోగా)

రాధా—వెళ్తున్నావేం!

లలి—ఇంకా చాలా పనుంది. కూర్చుంటే ఎల్లా?

రాధా—మరి రేపు పండగ ప్రయత్నాలేమిటో చెప్పలేదు నాతో (లలిత గబగబా బొమ్మను తుడవటానికి ప్రయత్నించటం చూసి) ఇంకా దానిమీాద ఆశ తీరలేదూ, దాన్ని బాగుచేయగలిగితే ఆనారాయణయ్యను బాగుచేసినట్టే. (అని బొమ్మను తీసి దూరంగాపెడుతూ) డాక్టర్ రేపటి పండుగంతా యిక్కడే గడుపుతానన్నాడు. అంటూ ఇంకో కోరిక కోరాడు.

లలి—కోరిక ఏమిటి?

రాధా—నువ్వు మొన్న తను రాసిన గీతంనువ్వు తప్పకుండా పాడాలన్నాడు.

లలి—అదా!

రాధా—ఆ; అదే మరిదానికి స్వరం కట్టేనా? లేదు కాదూ? పాపం. ఆ గీతమంటే అతనికిప్రాణం-(నవ్వి) ఆగీతంపాడు తుంటే వక్కసారి విని చచ్చిపోవాలనుందట. (నవ్వు తాడు)

లలి—ఎలాపాడను!

రాధా—ఏం! పాడటానికేం!

లలి—నావీణె తీగెలు తెగిపోయాయి. అసలే అపశృతి పలు కుతూంది. మంచితీగెలు ఈవూళ్లో దొరుకుతాయో లేదో!

రాధా—దొరక్కపోతే తెప్పిద్దాం. ఎంతలో తేవాలి. ఎంతలో బిగించాలి.

లలి—తీరికవుంటుందా? బోలెడంతపని. ఇది మామూలు పండగా......శాంతగూడా వుంది.

రాధా—అంతా శాంత చేస్తుందిలే. ఫర్వాలేదు. నామాధవీ లత ఇవ్వాళ ఇంత బెంగపడుతున్నదేం (దగ్గరకు తీసు కుని నవ్వుతూ) మాచిట్టిచిలుక జీవితమే ఒకగీతం- మాటే ఒకపాట.

లలి—ఇది నిజమా! పై పై మాటా?

రాధా—నామాట విలువ అంతేనా?

లలి—ఇలా కూర్చుంటే ఎల్లా... బోలెడంత...పని...

రాధా—అయితే ఈలోగా పనిపూర్తి చేసెయ్యి-ఇంతలో కాస్త ఆఫీసుపని చూసుకుని నేనూ వచ్చేస్తా.

(రాధాకృష్ణ వెడతాడు లలిత బొమ్మకి నూనెరాసి బాగా తుడుస్తుంది. కాని నువ్వుపోదు అలిసిపోతుంది) "అమ్మ అమ్మ" అంటూ లోపల పిల్లలగోల వినిపిస్తుంది. పిల్లలు పరుగెత్తుకువస్తారు. వెనకనే శాంతకూడా వస్తుంది. వాళ్ళను చూడంగా నే]

లలి—రాకండి. ఇటురాకండి. ఇటురాకుండా దూరంగా పోండి. ఇక్కడికి వచ్చి నాగుండెల్లో మరింత మంట పెట్టకండి.

శాంత—నే నన్నం పెడితే. వీళ్ళు సరిగ్గా తినటం లేదు—లలితా. నీకోసం గోలచేస్తున్నారు.

లలి—వీళ్ళను తీసుకుపో. నాదగ్గర్నించి తీసుకుపో. నాదగ్గర కొస్తే చెడిపోతారు తీసుకుపో ముందు వాళ్ళని.

శాంత—అదేమిటి! అలా కేక లేస్తావ్!

లలి—ఏం లేదు. వాళ్ళని—నేనే... చెడగొడుతున్నాను. కని, పెంచి, పెద్దనుచేసి నేనే—నా చేతుల్తో నే, వీళ్ళని చెడగొడుతున్నాను.

శాంత—ఏమిటి లలితా! నీ కేంమతిపోయిందా?

లలి—పోయింది. నే నన్నీ మతిలేని పనులే చేస్తున్నాను. ఆ బొమ్మమొహాన మచ్చపడింది; వీళ్ళ జీవితాలకే మచ్చ తెస్తున్నాను.

శాంత—బాగా నేవుంది; నువ్వెళ్ళి కాసేపుపడుకో. పనులన్నీ నేను చూస్తాను. (పిల్లలు దూరంగా వెళ్తారు. వాళ్ళని చూస్తూ)

లలి—వీళ్ళనా!! వీళ్ళని నేనే చెడగొడుతున్నా! నావల్ల వీళ్లు పాడయిపోవాలా!!

శాంత—ఏమిటిదంతా! – ఏం జరిగింది!

లలి—ఏం లేదు. ఏం లేదు. (అంటూ వీణదగ్గరకెళ్ళి వీణను తీసుకుని చూసి) ఒక తీగె తెగింది. అపశ్రుతి పలుకుతోంది. దీన్నెలా బాగు చెయ్యటం? ఎలాదీంతో పాడటం? పిల్లల్ని తీసుకుపో అవతలకి. వాళ్లు దగ్గరవుంటే దీన్ని బాగు చేసుకోలేను. కాసేపు దూరంగా– ఎంతదూరంగా తీసుకు వెళ్ళగలిగితే అంతదూరంగా తీసుకుపో.

శాంత—అల్లాగే.

లలి—ఇప్పుడప్పుడే నాదగ్గరకు తీసుకురావద్దు.

శాంత—అల్లాగే. (పిల్లలిని తీసుకు వెళ్తుంది)

లలి—తలుపువేసి వచ్చి నుఃఖిస్తూ కూర్చుంటుంది. డాక్టర్ రాసియిచ్చిన పాట పెదవులమీద ఆడుతుంది. నిమ్మదిగా పాడుతుంది. (లోపల శాంత తలుపుకొడుతూ "లలితా-లలితా")

లలి—(లేచి గడియతీస్తూ) నువ్వా! అబ్బ! గడియ బాగా బిగిసిపోయింది. (బలవంతాన తీస్తుంది)

శాంత—(లోపలికివస్తూ) ఏమిటే! ఊరికే లోపల ఏం చేస్తున్నావ్?

లలి—వీణ బాగుచేసుకుంటున్నా. ఇంకా చాలాపనుంది. పిల్లలు.

శాంత—నువెళ్ళి పిల్లల్ని చూడు. వీణ నే బాగుచేస్తా.

లలి—నీకు తెలియదు. నేనే బాగుచెయ్యాలి! బాగుచేసినా పాడుచేసినా—పిల్లల్ని—శాంతా – తల్లిలేని పిల్లలు ఎలా వుంటారో నాకు బాగా తెలుసు. తల్లిలేకుండానే నేను పెరిగాను. ఒకవేళ నేనులేకపోతే—నాముగ్గురిపిల్లల్ని నువ్వే చూడాలి—

శాంత—ఏంమాట లివ్వి —!

లలి—నాకు జబ్బుచేసో, మరేదయినా,......

శాంత—పండగపూటా అదేమిటి! ఊరుకో; నీకు మతి పోతోంది. (కాసేపు నిశ్శబ్దం)

లలి—ఇవ్వాళ ఒకపాట పాడతాను. కొత్తపాట.

శాంత—డాక్టర్‌గారి ఎదుటకాదూ! చూడూ? ఈడాక్టర్ ఎలాంటివాడు?

లలి—మంచివాడే ?

శాంత—ఎప్పుడూ అలా విచారంగా వుంటాడేం?

లలి—నయంకాని జబ్బేదో ఆయన్ని వేధిస్తోంది. దాంతో నే ాను, 'సమాప్త' నంటాడు.

శాంత—పాపం-పైకి మంచిగా నేకనిపిస్తాడు. చూడు లలితా! నువ్వు డాక్టరుతో నడుపుతున్న వ్యవహారంమానెయ్యాలి.

లలి—ఏ వ్యవహారం!

శాంత—నీకు డబ్బుయిచ్చాడుగా ఓ ధనికుడు.

లలి—అతను ఈ డాక్టర్ గాడు.

శాంత—మరెవరూ ?

లలి—డబ్బు యిచ్చినాతను స్నేహితుడుకూడా కాదు. (ఉద్రేకంగా) కాని — దీనిసంగతి యివ్వాళే తేల్చి వెయ్యాలి —

శాంత—అదేమిటి ?

లలి—అహా ! ఏం లేదు.

శాంత—ఏం లేదంటూ వేమిటి ? నువ్వసలు ఇవ్వాళేం మామూలుగా లేవు. ఏదో వుంది. ఏమిటిది ?......నాకు చెప్పటాని కేం

లలి—ఏం లేదు. శాంతా !

[రాధాకృష్ణ ఆఫీసు గదిలోంచి వస్తాడు]

రాధా—ఏమిటిది ?

లలి—ఏం లేదు. శాంత వీణబాగు చేస్తా నన్నది.

శాంత—మరి కొత్త తీగెలు తెప్పించావా !

లలి—లేదు తెప్పించాలి.

శాంత—తెప్పించి-వేసి తీసుకువస్తా !

లలి—అలాగే. (శాంత వీణ తీసుకుని వెళ్తుంది)

లలి— చూడండి.

రాధా— ఏం?

లలి—నా కొక వరం కావాలి.

రాధా—అడిగిందే తడువుగా యివ్వటానికి నేనేం దశరథుణ్ణి గాను.

లలి—చాలా చిన్న "వరం." మీ కేం కష్టం లేదు.

రాధా—చెప్పరాదూ అదేమిటో ?

లలి—నే నిందాక అడిగిందే-ఆ నారాయణమ్మ సంగతి.

రాధా—నే చెప్పిందంతా అప్పుడే మర్చిపోయావూ ?

లలి—అలా అనకండి; నారాయణమ్మ దుర్మార్గుడు; దుర్మార్గుడితో వినోదం పనికిరాదు. వూరంతా గోలచేస్తాడు.

రాధా—అందుకని అతని తప్పులు మర్చిపోవాలా ?

లలి—అతని పాపాన అతనే పోతాడు. చేతులారా అతని నోటిదగ్గర కూడు తీసెయ్యటం దేనికి ?

రాధా—అదే మనలో వున్న లోపం, ఇల్లా జాలి చూపెట్టటమే పనికిరాదు. ఈ జాలివల్లే దుర్మార్గులు బ్రతకగల్గుతున్నారు. వాడికి ఆఫీసులో కూడా పెద్దా, చిన్నా, లేకుండా వుంది. ఆఫీసులో కూడా, "ఏరా, రాధా" అంటాడు. ఇక నాకక్కడ గౌరవం ఏ మేకుస్తుంది ?

లలి—అంత సంకుచితంగా చూడకండి

రాధా—సంకుచితం లేదు, గింకుచితం లేదు. ఆ డిస్మిస్ కాగితాలు అతనికి అందిపోయాయి. ఇహ నాచేతిలో ఏం లేదు. ఏం చేద్దామన్నా చెయ్యలేను.

లలి—అయితే యిక తప్పదా...సర్వనాశనం...

రాధా—అదేదో నే పడతాలే. మరేం ఫర్వాలేదు. (ఆఫీసు గదిలోకి వెళ్తారు) (లలిత క్రిందపడివున్న బొమ్మతీసి మచ్చవైపే చూస్తుంది. తీసుకెళ్ళి బొమ్మలకొలువులో పెడుతుంది. కొలువు వంకే చూస్తుంటుంది లోపల పిల్లలు గోల)

లలి—అబ్బ-! పిల్లలు గోల—(ఉద్రేకంతో బొమ్మను తీసి నేలమీద కొడ్తుంది. బొమ్మ ముక్కలవుతుంది. బయట పిల్లలగోల ఆగుతుంది. కాసేపటికి బయట తలుపుకొట్టిన శబ్దం) (తలుపు తీసి) మీరా!! వారేదో పనిమీద నున్నారే.

[డాక్టర్ శేఖరం లోపలికి వస్తాడు]

చం—మీరూ? మీరు పనిమీద లేరుగా!

లలి—ఏమైనా విశేషముందా?

చం—విశేష మేమీ లేదు. అన్ని విశేషాలకీ నేను సిద్ధంగానే వున్నాను. కాని యింత త్వరగా యిది సంభవిస్తుందనుకోలేదు.

లలి—ఏమి టది. డాక్టర్ గారూ! ఏమిటో చెప్పండి.

చం—ఏ చెప్పి ఏంలాభం? మన చేతిలో ఏముంది! అంతా పూర్తయింది.

లలి—మన చేతిలో ఎప్పుడూ...ఏదీ లేదు డాక్టర్ గారూ?

చం—తన మనసు తనే మోసం చేసుకోవటంలో అర్థం లేదు. రోజులు మారినా, సత్యం మారదుగా! ఎప్పుడూ సత్యాన్నెదుర్కోటానికి ప్రయత్నించాలి. గాని తప్పించుకోవటానికి చూడగూడదు.

లలి—అదీ నిజంగానే కనిపిస్తుంది. కాని ఆ ధైర్యం వుండాలిగా?

చం—ధైర్యంలేకే తప్పించుకోవాలని ప్రయత్నిస్తాం. కాని, చిట్టచివరికి తప్పించుకోలేం. నేను రోగుల్లో కల్లా

వక పెద్దరోగిని. ఇవ్వాళ మళ్ళీ స్వయంగా పరీక్ష చేసి చూసుకొన్నాను. ఆరోగ్యం అంతా దివాళా అయినట్లు లెక్కలు తేలిపోయాయి. బహుశా ఈ నెల్లోనే నేను ఈ అవతారం చాలించ బోతున్నాను.

లలి—అంత నిరాశపడతారేం ?

చం—జీవితం అంతా నిరాశే. అది తేలిపోయింది. అంత కంటే అసహ్యమయిం దేమిటంటే డాక్టర్‌నై వుండీ, అంతా తెలిసే ఇలా బాధపడటం. మరణం నిశ్చయం అయి పోయింది. ఎప్పుడా అన్నదే ప్రశ్న—ఆ ఘడియను దగ్గ రకు లాక్కురావాలనే ప్రయత్నం.

లలి—ఆత్మహత్యా !!

చం—అలాంటిదే—ఏం ? అది మంచిది కాదూ; సత్యాన్ని ఎదుర్కోవటం అంటే అదేగా. అయితే ఒక చిన్న కోరిక. మీరుగాని, రాధాకృష్ణగాని, నా మరణశయ్య దగ్గరికి రాకూడదు అంతే.

లలి—డాక్టర్ గారూ !

చం—మీ యిద్దర్నీ చూస్తూ సుఖంగా చచ్చిపోలేను.

లలి—డాక్టరుగారూ!

చం—ఇహ దీట్లో బేరాలేం పనికిరావు. నిశ్చయమై పోయింది. ముహూర్తం మాత్రం యింకా తేలలేదు. ముహూర్తం తేలంగానే, ఒక తెల్లని కాగితముమీద నల్లని సున్నాగీసి పంపుతాను. ఆ నల్లటి సున్నాయే

మీకుగుర్తు. ఇక డాక్టర్ మీకు ప్రాణాలతో కని పించదు.

లలి—ఇవాళ-అంతా యిల్లా మాట్లాడు తున్నారేం? రేపు మీరు వస్తారని చక్కటి విందు ఏర్పాటుచేశాను. మీకు యిష్టమని ఆ పాటకి స్వరంకట్టి పాడబోతున్నాను. ఎంతో సంతోషంగా ఉండాల్సిన రోజు—కాని,

చం—ఆఖరిరోజు! నా వెనకనే మృత్యుదేవత నుంచుకుని (నవ్వి) ఎన్నడో మా "నాన్న" చిన్నతనంలో చేసిన దోషానికి-ఆయన రోగానికి వడ్డీగా నాజీవితాన్నర్పిస్తూ...

లలి—ఇక వూరుకోండి మీరు.

చం—అవును! ఇదే సత్యమంటే ఈ వెన్నెముక చెడిపోవటానికి కారణం నా తండ్రి అమాయకపు యౌవ్వనం. ఆయన స్వయంకృతాపరాధం-నన్ను -

లలి—ఆయన జబ్బు మీకు వచ్చిందంటారా?

చం—అదే! అంతే! అంతేగాదు. పెళ్ళిచేసుకుని నేను పిల్లల్ని కంటే వాళ్ళకీ వచ్చేది ఈ జబ్బు. తల్లి తండ్రుల గుణాలూ, అలవాట్లూ, తత్వాలేగాదు వ్యాధులుగూడా వస్తాయి. పిల్లలికి వచ్చి సాధారణంగా వాళ్ళజీవితాల్ని నాశనం చేస్తాయి.

లలి—నిజంగానా డాక్టర్ గారూ! తల్లి తండ్రుల దుర్గుణాలు పిల్లల్నికూడా పీడిస్తాయా?

చం—ఆ! అందులోనూ, వాళ్ళ స్వయంకృతాపరాధమే లేకుండా; మీకు చెప్పలేదుగాని పిల్లలు పుడితే వాళ్ళకీ

యీా జబ్బు వస్తుందని నేను పెళ్ళికూడా మానుకున్నాను.

లలి—ఇది మరీ ఘోరంగావుంది.

చం—నేను బాధపడేదీ అదే.

లలి—కాదు డాక్టర్. ఈబాధ అందరూ పడాల్సిందే. తల్లి తండ్రుల గుణాలూ-తత్వాలూ - పిల్లలికి ప్రాప్తిస్తే తల్లి తండ్రులే పిల్లలకి ప్రబల విరోధులవుతారు. దీనికి నేనూ బాధపడాలి. ప్రతిమనిషీ బాధపడాలి మన మందరం బాధపడాల్సిందే.

చం—మీాకింత వుద్రేకం వచ్చిందేమిటి!..............
అయితే......!!

లలి—మరేంలేదు. మీా బాధ నే గ్రహించాను. అంతే.

చం—అయితే?

లలి—మీారు చెప్పింది నిజమే. జీవితం జీవించతగ్గది కాదు? ఆత్మహత్యే మంచిది.

చం—ఆత్మహత్యా!

లలి—(స్మృతి తెచ్చుకున్న దానిలాగ) ఆ-ఆ-నేనేమన్నాను. అత్మహత్య!......కాదు...జీవితాన్ని సరిదిద్దుకోవాలి? బాగుచేసుకోవాలి-మృత్యువుతో పోట్లాడన్నా సరే.

చం—.........ఊ......నే వస్తానండి. మనిద్దరి మనస్సులూ సరిగాలేవు. మాట్లాడకుండా, వుంటేనే బాగుండేది. (లలిత మాట్లాడదు. డాక్టర్ వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళబోతుండగా)

లలి—మీరు వారికోసం వచ్చారుగాదూ. వారాగదిలో వున్నారు.

[చంద్రశేఖరం రాధాకృష్ణ ఆఫీసుగదిలోకి వెళ్ళబోతుంటే]

లలి—మీకూ వారికీ ప్రాణస్నేహంగాదూ?

చం—నాకూ నా ప్రాణానికీ స్నేహంలేదు. రాధా నాకు నా ప్రాణంకంటె స్నేహితుడు.

లలి—వారికోసమన్నా మీరు ప్రాణాలు నిలబెట్టుకోవాలి. డాక్టర్‌గారూ. ఇదేనా ఆఖరికోరిక.

చం—(అర్థంకాక) మీమాటలు అర్థంకావటంలేదు.

లలి—ఈ మాటలకి ఏమర్థంవుంటుంది! మీరాట్టే కష్టపడకండి. లలిత విచారంగా అల్లాగే కూర్చునివుంటుంది.

[చంద్రశేఖరం వెళ్ళిపోతాడు. కాసేపటికి నారాణయ్య లోపలవైపు ద్వారంలోంచి వస్తాడు]

లలి—వచ్చారా! ఇటునుంచి ఎట్లావచ్చారూ?

నారా—ఆ - ఆ దొడ్డిదోవనవచ్చి యిందాకట్నించీ మీ వంటింట్లో కూర్చున్నా. సరే. మీకు అన్నివిషయాలూ ఈపాటికి తెలిసేవుంటాయి.

లలి—నిమ్మదిగా మాట్లాడండి. అవతల మావారున్నారు.

నారా—ఉంటే మరేమీ ఫర్వాలేదు.

లలి—నాతో మీకేం పనివుంది?

నారా—ఒక విషయంలో సంజాయిషీ కావాల్సివచ్చింది.

లలి—అదేదో త్వరగా కానియ్యండి.

నారా.—నేను డిస్‌మిస్ అయినసంగతి మీకు తెల్సిందా?

లలి—తెల్సింది. తెలిసీ నేనేం చేయలేకపోయాను. ప్రయత్నించినా నా వశంకాలే!

నారా—అంటే మీ భర్తగారికి మీ మీద ప్రేమలేదన్న మాట. నే నెంత అల్లరిచెయ్యగలనో తెల్సికూడా నన్ను డిస్‌మిస్ చెయ్యగల ధైర్యం వుందన్నమాట.

లలి—ఆయన కివంతా తెల్సునని మీ రెందు కనుకుంటున్నారూ?

నారా—నే నేదీ అనుకోవటం లేదు. ఇది తెలిసీ ఎన్నిగుండెలతో డిస్‌మిస్ చేశాడా అని.

లలి—నారాయణయ్యగారూ! వారినిగూర్చి కాస్త గౌరవంగా మాట్లాడటం మంచిది.

నారా—ఆ! ఆ; ఆయనగారికి తగినంతగౌరవం యిస్తూనే వున్నాను. కాని మీరిది పరమరహస్యంగా దాచినందువల్ల, చేసిన తప్పు ఎంత పెద్దదో, అర్థమవుతుందన్న మాటే......

లలి—ఆ-ఆ- మీరనుకు నేదానికంటే బాగానే అర్థమయింది ఇంతకూ మీరెందుకువచ్చారు.

నారా—(నవ్వి) చెప్తాను ఈదుర్మార్గుడికి, నీతిదూరుడికి వీడికి కాస్త దయాదాక్షిణ్యాలు వున్నాయి. చూడండీ,- అందుకని

లలి—దయాదాక్షిణ్యాలు వున్నాయి. ఆ దయా దాక్షిణ్యాలు కాస్త నాబూదా నాపిల్లలమీద చూపరాదూ?

నారా—ఎందుకు చూపాలి? మీవారూ-మీరూ, నామీదా నాపిల్లలమీదా దయచూపారు గనకా? దయా దాక్షిణ్యాల సంగతి తర్వాత ఆలోచిద్దాం! ఈవిషయంలో మీదేగాని తప్పు నాదేం లేదు.

లలి—లేదు.

నారా—దీన్ని మనలో మనం సర్దుకోవాలి. ఈ రహస్యం మనముగ్గురిలోనే వుండి పోవాలి.

లలి—కాదు-ఈ రహస్యం మావారికూడా తెలియకూడదు.

నారా—మీవారికి తెలియకుండానా? ఎట్లా దాచగలం? మరి ఈ డబ్బంతా ఇప్పుడే యివ్వగలరా?

లలి—యివ్వటానికి యిప్పుడు నాదగ్గరేం లేదు. కొన్నాళ్లయిన తర్వాతయితే -

నారా—అంటే డబ్బివ్వటానికి మీకు ఒకఉపాయం దొరికిందన్నమాట. మీరు డబ్బంతా యిచ్చేసినా, మీఫోర్జరీ చేసిన బాండు నేను తిరిగి మీకు యివ్వను.

లలి—తిరిగి యివ్వరూ! మరిదాన్నేం చేద్దామనీ!

నారా—దాన్ని జాగ్రత్తగా దాస్తాను. ఈ పరమ రహస్యం దాస్తాను మీరేదన్నా అఘాయిత్యం తలపెడితే—

లలి—తలపెడితే కాదు-తలపెట్టాను.

నారా—అహా! అప్పుడే!! అయితే ఇంట్లోంచి పారిపోదామనేనా,

లలి—కాదు.

నారా—అయితే అంతకంటె ఎక్కువ దేవన్నమాట. ఆత్మ హత్య లాంటిది.

లలి—అబ్బ! ఇదంతా మీకెలా తెలుసు?

నారా—మనలాంటివాళ్ళు యీపరిస్థితుల్లో ఆలోచించేవి అవేనండి. నేనూ మొదట్లో అలాగే అనుకున్నా—గాని ధైర్యంచాలక పోవటాన ... ...

లలి—నాకూ ధైర్యం చాలక పోవటానే...

నారా—అహా! మీకూ ధైర్యం చాలటంలేదూ?

లలి—లేదు.

నారా—అవున్లెండి ధైర్యంచాలక సహ్యాడోసుల్లో విషం తాగటం, డాక్టర్ల చేతుల్లోపడటం, ఊరంతా అల్లరవటం అనవసరపుగోల. ఆత్మహత్య ఇంతకంటె అన్యాయం లాభంలేదు ఇదీఅంతే, ఇంట్లోంచిపారిపోవటం పదిమందీ వెంటపడి గాలించి తిరిగి ఇంటికి ఊరేగింపుతో తీసుకు రావటం ఛీ ఛీ ఛీ. మూశాయా! ఓ ఉత్తరంవ్రాసి తీసుకువచ్చాను. దాంట్లో సంగతులన్నీ పూర్తిగా విపులంగా వ్రాశాను. ఇది మీవారికి పంపుతాను.

లలి—పంపకండి పంపద్దు. మీడబ్బు మీకు కట్టేస్తాను.

నారా—మీరు కంగారు పడకండి.

లలి—మీకు కావాల్సింది డబ్బేగా—ఎల్లాగో అల్లా సాధించి తెస్తాను. మీకెంతయివ్వాలో ... ...

నారా—నేను డబ్బు అడగటంలేదు- లలితమ్మగారూ!

లలి— మరేం కావాలి ?

నారా—చెప్తా, కూర్చోండి. నాకూ ఒకజీవనోపాధి అవసరం దానికిమీరు సహాయం చెయ్యాలి నే నీ సంవత్సరన్నర నించీ బాగానే వున్నాను. రాధాకృష్ణ మళ్ళీ నాజీవి తాన్ని కూలదోస్తున్నాడు. అందుకనే, ఈ వుత్తరం వ్రాశాను. దీన్ని చదువుకొని రాధాకృష్ణ నాకు జవాబు వ్రాయాలి. నాఉద్యోగం నాకు రావాలి.

లలి—మీకు ఉద్యోగంమాత్రం రాదు.

నారా—రాకపోతే మీపరువు ప్రతిష్టలు మీకు దక్కవు. అవ్వి నాచేతిలోవున్నాయి. మీరు ఆత్మహత్యచేసుకున్నా సరే-లేకపోతే... కాని ఆవేశంవద్దు నేముందే చెప్తు న్నాను. చచ్చి పరువుసాధించలేం (ఈఉత్తరం) చూపిస్తూ చదువుకొని రాధాకృష్ణ జవాబు యివ్వాలి. ఇప్పుడే యిది అతనికి అందుతుంది. కాని ఒకటిమాత్రం జ్ఞాపకం ఉంచుకోండి. మళ్ళా యీపాపిష్టి పని నేను చేస్తున్నా నంటే, దానికి రాధాకృష్ణే కారణం. మీ లెటర్ బాక్సు లో ఈ వుత్తరం వేసి వెళుతున్నాను. (వెళతాడు)

[లలిత అలా చూస్తూవుంటుంది. నారాయణయ్య వుత్తరం వెయ్యంగానే పెద్ద నిట్టూర్పు విడుస్తుంది. వెనక నించి శాంత వీణ బాగుచేసి తీసుకువస్తుంది]

శాంత—ఏమిటి లలితా.

లలి—(తనలో) నారాయణయ్య వుత్తరం లెటర్ బాక్సులో పడేశాడు. మా జీవితాలు నాశనమవుతాయి.

శాంత—ఇదిగో వీణ—చూడూ యింకేమన్నా చెయ్యాలా? అదేమిటి?

లలి—చూడూ, ఆ లెటర్ బాక్సులో...

శాంత—ఆఁ!...

లలి—దాంట్లో వుత్తరం కనిపించటం లేదూ.

శాంత—ఆ.

లలి—దాన్ని నారాయణయ్య రాసి దాంట్లో పడేశాడు.

శాంత—అయితే నారాయణయ్య నీకు అప్పు యిప్పించింది?

లలి—ఆ. ఇక వారికి సంగతులన్నీ తెల్సిపోతాయి.

శాంత—ఈ సంగతులన్నీ తెల్సిపోవటమే మంచిది-లలితా!

లలి—నీకు సంగతులన్నీ తెలియవు. మానాన్న సంతకం నేను ఫోర్జరీ చేశాను.

శాంత—ఫోర్జరీయా?

లలి—నువ్వు నాకు సాక్ష్యం యివ్వాలి శాంతా!

శాంత—సాక్ష్యమా!—నేనా!

లలి—ఆ. నాకు మతిపోతే.

శాంత—లలితా!

లలి—నేను యిక్కణ్ణించి వెళ్ళిపోతే...!

శాంత—లలితా!

లలి—నేను చచ్చిపోతే...!

శాంత—నీకు మతిపోయింది.

లలి—నీ సాక్ష్యం నాకు కావాలి. నామతిపోలేదనీ, బాగానే వుందనీ, ఈ వ్యవహారంలో వేరెవ్వరికీ సంబంధం లేదనీ, ఈ దోషం అంతా నాదేననీ, వారి కీసంగతేం తెలియదనీ, సాక్ష్య మివ్వాలి.

శాంత—సరే కాని, ఇదంతా ఏమిటి?

లలి—నీకు త్వరలోనే అర్థమవుతుందిలే! ఈ అద్భుతమైన సంగతి ఒకటి జరగబోతోంది.

శాంత—అద్భుతం!!

లలి—ఆ. మన్మహమైన అద్భుతం, కాని దాన్ని జరగనివ్వకూడదు—ఏమైనా గానీ.

శాంత—నేను నారాయణయ్య దగ్గరకు వెళ్లి వస్తానాగు.

లలి—వెళ్ళకు...అతను చెప్పితే వినేరకంగాదు.

శాంత—ఒకప్పుడు అతను నాకోసం ఏం చెయ్యటానికైనా సిద్ధపడినవాడేలే.

లలి—అహా! అయితే-ఇతనే నా—నీ......

శాంత—ఆ. అతనే...ఎక్కడుంటాం డతను?

లలి—నాకు తెలియదు. కాని...

శాంత—ఎవరినైనా కనుక్కొని వెళ్లి వస్తాను. (వెళ్ళబోతుండగా)

లలి—మరి వుత్తరం......ఉత్తరం సంగతెట్లా!

శాంత—లెటర్ బాక్సు తాళం వేసి వుందిగా,

లలి—ఆ. ఎప్పుడూ తాళం వేసే వుంటుంది.

శాంత—తాళం చెవులూ...

లలి—ఎప్పుడూ ఆయన దగ్గరే వుంటాయి.

శాంత—నే తిరిగి వచ్చేదాకా, మీ ఆయన్ని ఉత్తరాలు చూడనివ్వక. లెటర్ బాక్సు దగ్గరికి వెళ్ళనివ్వక ?

లలి—ఎలా ?

శాంత—ఎలాగో అల్లా. ఏదో వక మిషతో...

లలి—ఆయన ఉత్తరాలు చదివే టైం కూడా అయింది.

శాంత—అంతకంటే ఉపాయం లేదు. నీ తెలివంతా ఉపయోగించు నేను త్వరగా తిరిగివస్తా. (లోపల్నించి-రాధా 'లలితా' అని పిలుస్తాడు)

లలి—వచ్చేస్తున్నట్లున్నారు ఉత్తరాలకోసమే నేమొ! (లోపల్నించి, ''రాధాతలుపుతియ్యి లలితా! నేవెళ్లి ఉత్త రాలు చూచుకోవాలి'' అని కేక వేస్తాడు)

శాంత—నే వెళ్ళి త్వరగా వస్తాను. ఎల్లాగో ఒకలాగ యీ కాపేపు సమర్ధించు.

[ శాంత వెళ్తుంది లలిత తలుపుతియ్యగా రాధాకృష్ణ చంద్రశేఖర్ ఆఫీసు గదిలోంచి వస్తారు]

రాధా—అమ్మయ్యా! తలుపులు తెరిచిందయ్యా ఎల్లానైతేనేం. మరి పండుగ ప్రయత్నాలన్నీ అయ్యాయా ?

లలి—ఆ! అయినట్టే.

రాధా—రేపటి కేం పనివుంచకు.

లలి—అబ్బే.

రాధా—అల్లావున్నావేం ? అలిసి పోయినట్లు

లలి—ఏం లేదు.

రాధా—పనిఅంతా నువ్వే చేస్తున్నట్లున్నావే !

లలి—లేదు. శాంతే చేస్తున్నది.

(రాధాకృష్ణయ్య బయటకు వెళ్ళబోతుంటే)

లలి—చూడండీ!

రాధా—ఏమిటదీ?

లలి—శాంత వీణ బాగుచేసింది.

రాధా—ఆహా ! మంచిదే, వస్తా-ఉత్తరాలుచూడాలి.

లలి—వీణబాగుపడింది. కాని...

రాధా—(ఆగి) ఇంకేమిటీ ?

లలి—ఈ పాటకు స్వరంకుదరటంలేదు.

రాధా—మొన్న ఏదో స్వరంతో పాడావుగా ?

లలి—అది బాగాలేదు, కొత్తస్వరం కట్టాలంటే మీరూ కూడా కూర్చోవాలి శాస్త్రి.

చం—అయితే నేను వెళ్ళివస్తా.

లలి—కాదు, కాదు. మీరూవుండాలి.

చం—అహా ! కాదు, మళ్ళీవస్తాగా.

రాధా—పోనీలే వెళ్ళనీ లలితా ! త్వరగా నే వస్తాడు లే.

చం—వస్తా. త్వరగా నేవస్తా. ఇంతలో పాటకి స్వరం కట్టెయ్యండి... (చంద్రశేఖరం వెళతాడు)

రాధా—ఆ! నా ఉత్తరాలుకూడా ఒక్కసారి చూసేస్తా నింతలో.

లలి—నే నొకటి అడుగుతాను–కాదనరుగదా?

రాధా – ఏమిటీ–నారాయణయ్య సంగతా?

లలి—కాదు. ఇవ్వాళా రేపూ మీరు ఆఫీసు పని పెట్టుకూర్చోకూడదు.

రాధా—అంతేగదా?

లలి—మీరాఫీసుపనిలో పడితే వళ్ళేమరిచి పోతారు.

రాధా—అల్లాగే నన్నానుగా.

లలి—అల్లాగే అంటే కాదు.

రాధా—(చేతిలో చెయ్యి వేస్తూ) ఇదిగో! యిప్పట్నించీ రేపు రాత్రిదాకా ఏపని చెయ్యకుండా నీ ఎదటే కూర్చుంటాను. సరా,

లలి—అమ్మయ్య.

రాధా—ఆఁ,(తాళం చెవులకోసం జేబులు తడుముకొంటూ) ఉత్తరాలున్నాయేమో...చూసి...

లలి—అదేమిటి మళ్ళా?

రాధా—ఉత్తరాలు వచ్చాయిగా ఒక్కసారిచూసి—

లలి—ఇదేనా! నా చేతిలో చెయ్యి వేసి.

రాధా—అయితే! ఉత్తరాలుకూడా చూడకూడదా?

లలి—ఊహూ, అస్సలు అసలు చూడకూడదు.

రాధా—సరే! రామచిలుక మాటకు మారి తిరుగుందా – మరి పాటసంగతేమిటి?

లలి—రండి స్వరం కడదాం.

రాధా—మరి రా, ఆగు. కాగితం కలం పట్టుకు రావద్దూ.

(ఆఫీసు గదిలోకి వెళతాడు)

( లలిత తలలోంచి హైర్‌పిన్ తీసి గబగబా వెళ్ళి ఉత్తరాలబాక్సు హైర్‌పిన్‌తో తెరవబోతుంది. ఇంతలో రాధాకృష్ణయ్య రావటం చూచి వచ్చేసి వణికిపోతూ నుంచుంటుంది )

రాధా—ఇదిగో! కాగితం, కలం, కానియ్యి మరి.

లలి— అల్లాగే ఇవ్వాళ గొంతుకూడా బాగాలేదు.

రాధ—ఫర్వాలేదు పాడు.

లలి—ఏరాగంలో పాడను?

రాధా—సరే, ఇ నన్నే పాడమంటావు కాబోలు. అటు ఆఫీస్ పని కాకుండా, ఇటు యీపనీ కాకుండా.

లలి—కాదు. కాదు. పాడుతాను.

రాధా— కానీ మరి—

లలి—పాడతాను. కాని ఓ సంగతి చెప్పండి.

రాధా—ఏమిటది ?

లలి—ఓ భార్యా భర్తా వున్నారనుకోండి,

రాధా—మనలాంటివారేనా ?

లలి—ఆ. మనలాంటివారే. అచ్చంగా మనలాంటివారే.

రాధా—ఊఁ.

లలి—ఆ. భార్య వకతప్పు చేసింది.

రాధా—ఏం తప్పు ?

లలి—మరేం లేదు. వాళ్ళావిన్న తరఫున అబద్ధమాడింది.

రాధా—అహా! అందులో ఏముంది?

లలి—అహా. ఏం లేకపోతేను, దానివల్ల మరో కుటుంబానికి బాధ-ఆ ఇల్లాలికీ బాధే; అందరూ చాలా బాధపడ్డారు- ఆమెమీద కేసుపెట్టారుకూడా. ఆమె కోర్టుకెళ్ళాల్సి వచ్చింది.

రాధా—అదా!

లలి—అప్పుడా భర్త ఆమెనెట్లాగన్నా రక్షించాలని ప్రయత్నిస్తాడు.

రాధా—అవును. భార్య కోర్టుకెళ్ళాల్సివస్తే భర్త వూరుకుంటాడా? ఎట్లాగన్నా తప్పించాలని ప్రయత్నించడూ?

లలి—ఎట్లా తప్పించటం!!

రాధా—ఏముంది? నేరం-తనే చేశానంటాడు.

లలి—ఆ. మరి శిక్షపడితే...

రాధా—తనే అనుభవిస్తాడు.

లలి—ఛ. ఛ. అదేమిటే; నేరం చేసింది భార్య అయితే...

రాధా—కాని భార్యను అట్లా బాధపెట్టే భర్త వుంటాడా?

లలి—కాను కాదు. భర్త నేరం తలమీద వేసుకుని భార్యను కాపాడటానికి ప్రయత్నిస్తాడు. కాని, భార్య కోర్టులోకి వచ్చి......

రాధా—వచ్చి—?

లలి—నేరం తానుచేశానని చెప్తుంది. తనే శిక్షననుభవిస్తుంది.

రాధా—అదేమిటి ?

లలి—మరి భర్తను అన్యాయంగా బాధపెడుతుందా?

రాధా—ఛ-ఆడది శిక్షపడి జైలుకెళ్ళటమేమిటి ? ఇంతకూ ఏమిటీ పిచ్చికథ ?

లలి—పిచ్చికథే...ఆ. పాటపాడ్తానన్నా కాదూ. పాడతాను వీణవాయిస్తూ పాడనా, బాగుపడిందిగా వీణ.—ఆ... వ్రాయండి మరి—
(వీణతీసుకు ఆలాపించి.) వ్రాశారా ?

రాధా—వ్రాయలే, ఏం వ్రాయను-స్వరం నువ్వు కడుతూ పాడాలిగా.

లలి—అహా. అవును, పాట స్వరంతో పాడితేగా వ్రాయటం; పాడతాను. (స్వరం ఆలాపించి మొదటిచరణంపాడి;—) ఎట్లావుంది...

రాధా—బాగుంది.

లలి—బాగాపాడతాను. ఇంకా బాగుంటుంది. ఇదిగో.—
(పాట పాడుతుంది.)

రాధా—బాగుంది. పాట అయిపోయిందిగా. ఇక లేద్దాం.

లలి—అప్పుడేనా ! ఇంకా శాంత రాలేదే—(నాలిక కరుచుకుంటుంది)

రాధా—వస్తుందిలే, చాలాం అలిసిపోయాను-శాంత వచ్చే లోపున మరోపని చేసుకోవచ్చుగా.

లలి—ఇంకేం పనుంది ?

రాధా—ఏదో ఒకటి. ఆ-బొమ్మల అలంకారంసంగతిచూడు-ఈలోపల నేనూ...

లలి—ఉత్తరాలు చూస్తారా ?

రాధా—అహ-ఇందాక ఆఫీసు కాగితాలు బల్లమీద పడేసి వచ్చాను సర్దుకుని వస్తాను. తర్వాత...

లలి—తర్వాత—?

రాధా—మరేం చెయ్యాల్లే. సీతో తీరుబడిగా కూర్చుని కబుర్లు చెప్తాను.

లలి—ఎంత బాగుంటుంది అల్లాకూర్చుంటే!

రాధా—నీకు పిచ్చెక్కినట్లుందివ్వాళ. ఏమిటీ వాగుడు. (బయటవైపుకు నడుస్తాడు)

లలి—ఇటెక్కడికి? ఆఫీసు కాగితాలు సర్ది రావాలన్నారుగా ?

రాధా—ఏంటే-ఎవరో వస్తున్నట్లుంటేనూ. లేదులే-ఎవ్వరూ రావటంలేదు – ఆ! నారాయణయ్య యిందాక ...

లలి—ఆ – వచ్చాడా ?

రాధా—రాలేదు కాని – ఇందాక నాతో ఎట్లా మాట్లాడాడో తెల్సా !

లలి—ఏదో ఒకటి మాట్లాడాడు. వాడి సంగతి ఈ రెండు రోజులూ మర్చిపొండి.

రాధా—అల్లాగే లే.

లలి—వెధవ- దుర్మార్గపు వెధవ-విషపురుగ్వా వాడూనూ!

రాధా—అవును.

లలి—తనకవసరమైతే కలువునా కూల్చటానికైనా వెను
దియ్యడు.

రాధా—వాడి సంగతి నీకూ అర్థమయినట్లుందే.

లలి—లేదు, వాడి సంగతి నాకేం అర్థం కాలేయింకా.

రాధా—సరే వస్తా ఆఫీస్ కాగితాలు సర్దుకునివస్తా,

[లలిత అలాగే కూర్చుంటుంది. లేచివెళ్లి లెటర్ బాక్సు తియ్యబోతుంది. బయటనుంచి శాంత వస్తుంది. ఇద్దరూ లోపలికి వస్తారు.]

లలి—ఏమయింది ?

శాంత– ఏదో వూరెళ్లాట. రేపుగాని రాడట.

లలి—అయితే మరి ఎట్లా ?

శాంత—రాంగానే యిక్కడికి రమ్మని చీటీవ్రాసిపెట్టి ఇంటి
దగ్గర యిచ్చి వచ్చాను.

లలి—శాంతా !

శాంత—ఆ.

లలి—త్యాగం అంటే నీకు తెల్సుగా ;

శాంత—ఆ.

లలి—అద్భుతమైన త్యాగం జరుగుతుంది.

శాంత—ఎక్కడా ?

లలి—అంతా త్వరలోనే, ఇక్కడే-కాని జరగటానికివీల్లేదు.
నాకోసం త్యాగంచేస్తుంటే-నేను మెదలకుండా వూరు
కోనా? వద్దు-ఏమైనాసరే ...... ఇవాళ యింకా 8

గంటలు. రేపింకా 24 గంటలు. మొత్తం 32 గంటలు పండుగ గడిచిపోవటానికి. పండుగ గడిచేదాకా ఉత్తరాలపెట్టి కాపాడాలి. ఈ లోపున ఉత్తరాలపెట్టి చూశారా! వినాశనం ఆరంభమవుతుంది. వద్దు వారిని ఉత్తరాలు చూడనివ్వద్దు. వారిని త్యాగం చేయనివ్వను. ఈప్రాణాలుండగా అలావీల్లేదు. ఈప్రాణాలొదిలైనా సరే-వారిని ఈ నేరం నెత్తిన వేసుకోనివ్వను.

శాంత—ఏమిటిది వెర్రితనం!

[లోపల్నించి రాధాకృష్ణ — మా కిన్నెరసాని అక్కడవుందా ఒకసారి యిటు రావాలి.]

లలి—ఇదిగో? వస్తున్నా, (కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ వెళ్తుంది. శాంత నిలబడిపోతుంది)

( తెర )

---

## మూడవ రంగము

[రాధా పచార్లు చేస్తూవుంటాడు. లలిత కూర్చుని వుంటుంది]

లలి—ఇంకా డాక్టర్ గారు రాలేదూ?

రాధా—ఏం పని తగిలిందో? శాంత ఏదీ?

లలి—లోపలవుంది.

రాధా—కాస్త కాఫీ అన్నా తాగితే బాగుండును. డాక్టరు వచ్చే లోపల కాస్త కాఫీ కలుపుకు రా,

లలి—శాంతను పిలవనా!

రాధా—ఎందుకూ! నువ్వు నాదగ్గిరకూర్చుని నిన్నట్నుంచీ ఆమెచేతే, అంతపనీ చేయిస్తున్నావ్, కాఫీనువ్వే కలుపుకు రారాదూ.

లలి—నేవెళ్తే, మీరు ఉత్తరాలు చూసుకోవచ్చునా?

రాధా—అబ్బే! అది కాదు, కాని. ...

లలి—శాంతా! శాంతా! కాఫీ కలుపుకురా కాస్త.

(శాంతలోపల్నుంచి "అల్లాగే.")

(ఈ లోపున రాధా వీధిగుమ్మం వైపుకు వెళ్తాడు)

లలి—(వెనక్కి తిరిగి చూసి) మాట.

రాధా—ఏమిటె... ... అంత ఖంగారు పడ్డావ్?

లలి—నిన్న పాడిన పాట వుందే.

రాధా—ఆ.

లలి—దానిపగస మర్చిపోయాను.

రాధా—అరే! నాకూ జ్ఞాపకం లేదే!

లలి—డాక్టరుగారు వచ్చేలోగా ఒకసారిపాడనా?

రాధా—ఆ; పాడు. (లలిత ఆలాపన చేస్తుంది. వీధివంక చూసి)

లలి—అమ్మయ్య! డాక్టరుగారు వచ్చేశారు.

[చంద్రశేఖరం బయట నుంచి వస్తాడు]

రాధా—ఇంత ఆలస్యమయిందేం? నీకోసం కాచుక్కూర్చున్నాం!

డాక్ట — సారీ! ఏర్పాట్లు పూర్తి చేసుకుని వచ్చేసరికి ఆలశ్య మయింది. ఇవ్వాళ ఒక్కరోజు హాయిగా గడిపితే, తర్వాత ప్రాణంపోయినా, ఫర్వాలేదు.

[శాంత కాఫీ తెస్తుంది.]

లలి — కాఫీ ఇప్పుడు ఒద్దులే, డాక్టర్ గారు వచ్చేశారుగా. అందరం ఒక్కసారే తాగుతాం.

రాధా — మనం — పైన గదిలో కూర్చుంటే బాగుంటుం దేమో,

లలి — ఆగతిలోనే కూర్చుందాం, పదండి; నేను వీణ తీసుకు వస్తాను. (అందరూ వెళ్తారు. శాంత మిగిలిపోతుంది. లోపల్నుంచి పాట వినపడ్తూ వుంటుంది)

[నారాయణయ్య బయటనుంచి వస్తాడు]

నారా — (వస్తూ) శాంతేనా! ఆ! ఎందుకూ! నాకోసం చీటీ ఏదో పెట్టావ్?

శాంత — తప్పని సరిగా ఒక్కసారి మాట్లాడాలని.

నారా — నిజంగా! నేనిక్కడకు రావడం కూడా అంత అవ సరమైందా?

శాంత — ఆ. ఇక్కడ ఎవరూ లేరు-అంతా పైన పాటకచ్చే రీలో వున్నారు.

నారా — అంతా అంటే ఎవరూ! లలితా రాధాకృష్ణ పాటకచ్చేరీల్లో వున్నారా యిప్పుడు!!

శాంత — అవును, ఏం పాడుకో కూడదా యిప్పుడు?

నారా—అవును. ఎందుకు పాడకూడదూ. పాడుకోవచ్చు. ఇంతకూ ఎందుకూ పిల్చావ్?

శాంత—కాస్త మాట్లాడాలి.

నారా—మనిద్దరిమధ్యా ఏముంది ఇంకా మాట్లాడటానికి?

శాంత—చాలావుంది.

నారా—చాలానా! మనిద్దరిమాటలూ, చాలాకాల క్రితమే తెలిసిపోయాయిగా!

శాంత—మనసులు మంచిగావుంటే మాటలుతిరుగుతాయా?

నారా—శాంతా! నీ మనస్సులో నాకింకా చోటువుందా?

శాంత—నేనూ అదే ఆలోచిస్తున్నాను; ఆచోటు ఎక్కడిదా అని.

నారా—నువ్వు నమ్ముతావో, లేదో కాని - యివ్వాళ నేననేది ప్రతినిత్యం అనుకుంటూనే వున్నాను, నిన్నొదిలి వచ్చిన క్షణాన నా సర్వనాశనం ప్రారంభమయింది. ఏమనుకొని ఏంలాభం?

శాంత—అనుకునేం లాభంలేదు. చేతనైనంతవరకూ ప్రయత్నిస్తే లాభంవుంటుంది.

నారా—బ్రతకటమే ఆశయంగా, యీ పదిహేను ఏళ్ళూ గడిపాను కాని—

శాంత—కాని—?

నారా—కాని, పదిహేనేళ్ల క్రిందటి సంగతే తిరిగి మళ్ళీ సంభవించింది.

శాంత—కష్టపు రోజుల్లో కష్టపు రోజులు జ్ఞాపక మొస్తాయి కాబోలు.

నారా—వచ్చాయి; నే నిప్పుడు వడిసముద్రపు నావలో వున్నాను. నావ మునిగిపోతున్నది. నా భార్య ముగ్గురు పిల్లల్ని వదిలి చనిపోయింది. ఇప్పుడీ ఉద్యోగం పోయింది. వెనక చిన్నతనంలో చేసిన తప్పులన్నింటికీ ఇప్పుడు జవాబు చెప్పుకోవాల్సి వస్తోంది!

శాంత—భగవంతుడి మీద విశ్వాసం వుంచితే ఏదో ఒక దారిచూపించకపోడు.

నారా—ఏదో ఒక దారి కేం ఇబ్బంది వుండకపోయేదే—నువ్వు రాకపోతే, యీ ఉద్యోగం వూడేది కాదుగా!

శాంత—ఉద్దేశపూర్వకంగా నే నడ్డంరాలేదు; నీపోస్టు నాకు యిస్తున్నారని నాకు తెలియనే తెలియదు.

నారా—కాని. ఇప్పుడు తెల్సిందాగా; తెల్సి అడ్డురావడం మానుతున్నావు గనకనా?

శాంత—మానితే నీకు గల్గే లాభం ఏమిటి?

నారా—లాభం! లాభం! లాభం వుండనీ-లేక పోనీ-

శాంత—ప్రపంచంలో నమ్మక ద్రోహం పనికిరాదు. అదే యీ నికృష్టపు జీవితం మనకు నేర్పే పాఠం.

నారా—జీవితం నాకు వట్టొట్టి నీతి వుపన్యాసాలని నమ్మ గూడ దని నేర్పింది.

శాంత—అదీ నిజమే కాని స్నేహితుల్ని నమ్మవచ్చుగా!

నారా—నువ్వనే దేమిటో నాకర్థం కావటంలే.

శాంత—నడిసముద్రపు నావలో నున్నా నన్నాపుకదూ-ఇందాక.

నారా—అలా అంటానికి కారణం లేకపో లేదుగా?

శాంత—నేనూ అదే పరిస్థితిలో వున్నాను. మనిద్దరిలో ఒకరి కొకరు సానుభూతి చూపించుకుంటూ కూర్చోవ నక్కరలేదు

నారా—అల్లాగే-నీయిష్టం.

శాంత—నాకొక్క-కొన్ని యిష్టాలంటూ వుంటేగా ఎన్నుకోటానికి.

నారా—సరే! ఇంతకూ నువ్వు అనేదేమిటి?

శాంత—ఒక్కసంగతి చూడదూ; ఇలాంటి నావలో, నావలో వున్న యిద్దరు కల్సి, నావ నడపటానికి చూస్తే బాగుంటుందేమో,

నారా—ఏమంటావ్!

శాంత—నావలో నంటికిగా వేలాడే బదులు యిద్దరూ కలిస్తే త్వరగా వడ్డున పడవచ్చేమో!

నారా—శాంతా!!

శాంత—నే నీ వూరు ఎందుకు వచ్చాననుకున్నావ్?

నారా—అయితే ఇందుకే వచ్చానంటావా?

శాంత—జీవితంలో అన్ని కష్టాలే అనుభవించాను. ఏకాకిని పనీపాట లేకపోవటంతో ఏమీ తోచటంలేదు. ఒక్క

స్వార్థానికే కృషి చెయ్యడంలో సంతోషం ఉండదు. ఈ నిరాశా జీవితానికి కాస్త ఆశ కల్గించు.

నారా—ఈమాట నేను నమ్మలేను. ఏదో విపరీతమైన త్యాగం నిన్ను పురికొల్పుతుంది.

శాంత—అలా అనటానికి నాలో ఏం కనిపెట్టావ్?

నారా—(అనుమానంతో) ఏదో వుంది. ఇక్కడ నా జీవితం ఎల్లాగడుస్తోందో తెలుసా?

శాంత—ఆఁ తెలుసు.

నారా—ఇక్కడ నన్నందరూ ఎలాంటి వాణ్ణంటారో తెల్సా?

శాంత—నాతో నువ్వలా వుండవని నాకు తెలుసు.

నారా—అదీ నిజమే.

శాంత—చాలా పొద్దు పోయినట్లుందే.

నారా—అయితే నువ్వు నిర్ధారణ చేసుకున్నట్టేనా! నీ వాలకం చూస్తే అలాగే వుంది. నీ కంత ధైర్యంవుందా? అని.

శాంత—నీ పిల్లలకి ఓ తల్లిలాంటివారు కావాలి, నాకూ పిల్లల్ని పెంచాలని వుంది. నీపైన నమ్మకమూ వుంది.

నారా—అయితే-అయితే - నేనూ జాగ్రత్తగా వుంటాను. తిరిగి ప్రపంచంలో కాస్త మంచిపేరూ ప్రతిష్ఠా తెచ్చుకోవటాన్కి ప్రయత్నిస్తాను,

శాంత—ఆగు. గట్టిగా మాట్లాడకు; వాళ్ళు వచ్చేవేళయింది.

నారా అయితే నేపోతాను కాని...ఆలశ్యమైపోయింది. నేను చేసినపని నీకు తెలియదు పాపం-లలితమ్మను.

శాంత—అదంతా నాకుతెలుసు

నారా—తెలిసికూడా ఈపని తలపెట్టావా ?

శాంత—నిరాశలో మనిషి ఎంతపనికి తలపెడతాడో నాకు బాగా తెలుసు;

నారా—కాని మించిపోయింది. ఇప్పుడేం చేయగలం - ?

శాంత— ఏమీ చెయ్యలేం, ఆ వుత్తరం ఇంకా ఉత్తరాల పెట్టెలోనేవుంది.

నారా—ఇంకా అక్కడేవుందా......నిజంగానా ?

శాంత—ఆ-నిజంగానే,......కాని......

నారా—అహా-దీనంతకీ అర్థం-ఇదా, ఈ తెగింపు నీస్నేహితు రాలిని కాపాడటంకోసమా!...చెప్పు. అంతేకాదూ.

శాంత—హా! ఒకసారి నమ్మి మోసపోయిన స్త్రీ మళ్ళీ ఆపనే చేస్తుందా ?

నారా—(ఆలోచించుకొని) మరి ఆ వుత్తరం తిరిగి ఇచ్చెయ్య మని అడగమంటావా ?

శాంత—అహా ! నువ్వడిగి తీసుకోగూడదు

నారా—ఏం ! అడిగేస్తాను. అతను వచ్చేదాకావుండి అడి గేస్తాను. అదేదో డిస్మిస్‌నుగురించిలే అంటాను.

శాంత—వద్దు.

నారా—ఇంతకూ యిది చెప్పవేం; లలితను రక్షించటాని కేగా నన్ను రమ్మన్నది!

శాంత__అసలు రమ్మన్నది అందుకే కాని నామనస్సు మారింది. రాధాకృష్ణకి యీ రహస్యం తెల్సిపోవటమే మంచిది వాళ్ళిద్దరిమధ్యలో రహస్యాలుండకూడదు. ఈ రహస్యాలు అబద్ధాలూవుంటే జీవితం దొంగతనంలాగ వుంటుంది.

నారా__సరే కానియ్యి-కాని-ఇక నాకేం లేదు. బాధ్యతంతా నీదే. నేచెయ్యగల్గింది నే చేస్తాననుకో, కాని - -

శాంత__వాళ్ళ పాటకచ్చేరీ అయిపోయింది. వాళ్ళిక వస్తారు.

నారా__అయితే నే వెళ్తా. నీకోసం నే బయటకాచుకుని వుంటాను.

శాంత__అల్లాగే.

నారా__ఇంత అదృష్టం నా జన్మలో నేనెన్నడూ ఎరగను. (అంటూ బయటకు వెళతాడు)

[రాధాకృష్ణ లలితను బలవంతాన లాక్కువస్తాడు]

లలి__(వస్తూనే) ఇంకొక్కపాట......నామాట వినండి.

రాధా__వినను; అంత ఆయాసపడుతూ-యింకా పాడతానంటావేం-అదిగో చూడు-ఎంతయిందో-పదిగంటలు.

లలి__ఒక్కటేగా! మరొక్కపాట.

రాధా__ఉహు! మన ఒప్పందం అయిపోయింది. (శాంతతో) చూడండీ; ఏడుగంటల్నించీ పాడుతోందా! ఇంకా పాడాలిట.

లలి—ఇంక వక్కటేగా,

రాధా—ఒక్కటిగాదూ-అరగాదు; పైగా ఎలా పాడిందను కొన్నారు ప్రాణాలన్నీ బిగబట్టి. తనప్రాణం అంతా యీ పాటమీాదే ఆధారపడ్డట్టు పాడుతోంది.

శాంత—దురదృష్టంకొద్దీ నేను సమయానికి రాలేక పోయాను.

రాధా—ఇంత బాగా పాడుతుందని నే నను కోనలేదు. అరే-శేఖర్ పై నేవున్నాడే.! లాక్కొస్తానుండండి ... ...
(వెళతాడు)

శాంత—నేనతనితో మాట్లాడాను.

లలి—ఆ! ఆ!

శాంత—నువ్వీవిషయం అంతా మీాఅయనకి చెప్పెయ్యి.

లలి—అదినాకు తెలుసు.

శాంత—నారాయణయ్య విషయంలో నువ్వేం భయపడ నక్కరలేదు. కాని అంతా చెప్పెయ్యటం మంచిది.

లలి—ఊహు-చెప్పను.

శాంత—అయితే, ఆ ఉత్తరమే చెప్తుందిలే.

లలి—అయితే ఏంలాభం లేదన్నమాట. సర్వనాశనం తప్ప దన్నమాట.

శాంత—ఏమీాఫర్వాలేదు. నామాటవిను; అదంతా చెప్పు; నీకేం ఫర్వాలేదు. నాకొస్తపనుంది. నే నిప్పుడే వస్తాను. (వెళుతుంది)

[ లలిత నిరాశగా ఆలోచిస్తూ కూర్చునివుంటుంది రాధాకృష్ణవస్తాడు ]

లలి—చాలా ఆలశ్యమయింది.

రాధా—ఆ, పదిగంటలయింది. శేఖర్ వస్తా పదమన్నాడు.

లలి—మీకు నిద్రరావడంలేదూ ?

రాధా— లేదు-నీకూ నిద్రవస్తూందిగాదూ?

లలి—ఆ. కా స్త ఆయాసంగాకూడావుంది.

రాధా—ఆ, ఒప్పుకున్నావ్ గదా, నేనిందాకే అనలా! నా మాట వింటేనా?

లలి—మీమాట వినడం ఎప్పుడూమంచిదే.

రాధా—ఇప్పుడు రామచిలుక కొంతవరకూ సరసంగా మాట్లాడుతోంది. ఆ-చూడు; ఇవ్వాళ మన శేఖరంలో ఉన్నమార్పు కనిపెట్టావ్?

లలి—ఏంమార్పు! నేనేం కనిపెట్టలేదే ?

రాధా—ఈమధ్య ఎప్పుడూ ఇంతసంతోషంగా లేడుకాదూ. (ఆమె వంక ప్రేమగా చూస్తూ నుంచుంటాడు)

లలి—అబ్బ అలాచూస్తారేం?

రాధా—ఏం! నా "మనస్సర్వస్వాన్ని"నా అంచాలకుప్పనీ; నేను మాచుకోగూడదా ?

లలి—ఇవ్వాళ రాత్రి మీ రటువంటి మాటలు మాట్లాడకండి.

రాధా—లలితా! మనిద్దరి మనస్సులూ ఎంతగా కల్సిపోయాయో చూశావా? ప్రేమ, అనురాగం, ఈ

మాటల నన్నిటినీ మించిపోలేదూ, ఈ రాత్రి యిలా ఒంటరిగా కూర్చుంటే నీకేం జ్ఞాపకం రావటంలే? ఇందాక నువ్వు పాడుతుంటే ఆనాడు పెళ్ళిచూపులకు వచ్చినప్పుడు నువ్వుపాడటం నాకు జ్ఞాపకం వచ్చింది. ఆ సంతోషం నిన్నిక క్రిందకు లాక్కొచ్చేటంతగా మించి పోయింది.

లలి—అబ్బ! నే నిక్కడ వుండలేను. వెళ్ళిపోతాను.

రాధా—అహా! వెళ్ళకు. అరే! వేళాకోళంకాదు. ఉండమంటుంటే (మెట్లమీద నడచినశబ్దం)

లలి—అబ్బ! డాక్టర్‌గారు వస్తున్నట్లున్నాడు.

రాధ—ఎవరది? (చంద్రశేఖరం లోపలవైపునుంచి "నేనే" రావచ్చా అంటాడు)

రాధా—ఆ-ఆ-రా-రా-(తలుపు తీస్తాడు)

చం—మీ రిద్దరూ చాలాకులాసాగా వున్నట్లున్నారే, ఇవ్వాళ.

రాధా—ఏదో......

చం—అవున్లే! ఆస్కారంవున్నప్పుడు అనుభవించాల్సిందే.

లలి—డాక్టరుగారు ఇవ్వాళ ఏదో క్రొత్తవిషయం కనిపెట్టినట్లున్నారే.

రాధా—కొత్తవిషయం కనిపెట్టాడా! అయితే కంగ్రాట్యులేషన్ శేఖర్! థాంక్యూ

చం—థాంక్యూ.

లలి— అయితే మీరు కనిపెట్టింది మన కనుకూలమైన దేనా ?

చం —ఓ చాలా అనుకూలమైనది-డాక్టర్ కి రోగికీకూడా.

లలి—నిజంగానా ?

చం—ఆ : నిజంగానే : అందుకనే యీ సంతోషం. తప్పే ముందీ దీంట్లో.

లలి— తప్పేం లేదు.

రా. నా.—సంతోషంలో డబ్బో-జబ్బో ఖర్చు కావటంలో తప్పేంలేదు.

చం—ఏదో ఒకటి ఖర్చు కాక సంతోషం ఎట్లా వస్తుందోయ్.

లలి— మీ మనస్సులో వున్న కోరిక నాకు తెలుసు డాక్టర్.

చం— ఏముంది ?
రాధా—నీకెలా తెల్సు } (ఒక్కసారిగా అంటారు.)

లలి—మీకు గంధర్వుల్లాగ వేషం వేసుకుని మేఘాలమీద నాట్యం చేయాలని వుంది కాదూ ?

రాధా—అల్లా ఒకసారి చెయ్యరాదూ-గమ్మత్తుగా.

చం—(నవ్వి) నేనివ్వాళే చేస్తానా నాట్యం?

రాధా—ఇవ్వాళా ! యీ తడవ ఏదన్నా నాటకంలో ఏర్పాటు చేయిద్దాంలే.

చం—అహ ; నాటకంలో కాదు, ఉత్తప్పుడే, ఇదీ మరో వేషంగూడా వుంది. ఒక అదృశ్య జీవి వేషం.

రాధా—అదేం వేషం?

చం—ఉందిలే, ఎప్పుడైనా విన్నావో లేదో-ఒక నల్లటి టోపీ వుంటుంది. అది పెట్టుకుంటే మనిషి మాయమై పోతాడు.

రాధా—అవునవును నిజమే -

చం—సరే; నేనిక వెళ్ళాలి, ఏదీ ఒకసిగరేట్ యియ్యి.

రాధా—(ఓ సిగరెట్ యిస్తాడు)

చం—So many thanks.—ఈ సిగరెట్ యిచ్చినందుకూ వెనక యిచ్చిన సిగరెట్లకూ కూడా. వస్తా. గుడ్ నైట్,

రాధా—గుడ్ నైట్.

లలి—రాత్రికి హాయిగా నిద్రపోండి డాక్టరుగారూ!

చం—థ్యాంక్సు ఫర్ ది గుడ్ విషెస్. (వెళ్ళబోగా)

లలి—నాకూడా బాగా నిద్ర బట్టేట్టు దీవించి వెళ్ళండి మరి—

చం—మీకా! ఓ! అల్లాగే-మీకు నిద్రపోవాలనుంటే.

(డాక్టర్ వెళతాడు, రాధా తాళాలుతీసుకుని బయలు దేరుతాడు)

లలి—ఎక్కడికి?

రాధా—ఉత్తరాలు చూసుకోవాలి. పెట్టె నిండిపోయింది.

లలి—ఇప్పుడా ఉత్తరాలన్నీ చదువుతూ కూర్చుంటారా

రాధా—అబ్బే! ఒక్కసారి చూస్తా. అంతే. (రాధా బయటకు వెళ్ళి కాగితాల మొత్తం లోపలికి తెస్తూ) ఇదేమిటి?

ఎవరో యీ తాళం తీయటానికి ప్రయత్నించి నట్లున్నారు.

లలి—ఏమో!

రాధా—(హేర్ పిన్ చూపిస్తూ ఈ హైర్ పిన్ను నీదేలాగుంది.

లలి—పిల్లలు ఏమన్నా తీశారేమో.

రాధా—అయితే పిల్లల్ని కాస్త జాగ్రత్తగా చూడాలి. ఇలాంటిఅల్లరి పనికిరాదు. (ఉత్తరాలుబయటకు తీస్తాడు) ఎన్ని ఉత్తరాలో! (రెండుకార్డులు తీసి) ఇవేమిటి?

లలి—డాక్టరుగారివా?

రాధా—ఆ. - వెళ్తూ పడేశాడు కాబోలు. పై నేవున్నాయి

లలి—దానిమీద ఏముంది?

రాధా—ఒక సున్నావుంది-నల్లగా దిద్ది-ఏమిటిది-అసందిగ్ధంగా; మరణ సందేశంలాగ -

లలి—ఆయన ఉద్దేశ్యం అదే, - అది మరణ సందేశమే-

రాధా—ఏమంటావ్! ఏమన్నా చెప్పాడా నీతో!

లలి—చెప్పాడు. ఈ కార్డు, ఈసున్నా, తన మరణానికి చిహ్నం అన్నాడు. అప్పటికే తాను ప్రపంచాన్ని విడిచేసి వుంటానన్నాడు.

రాధా—పాపం! నేనూ అనుకుంటూనే వున్నానుగాని యింత త్వరగా ఇలా అవుతాడనుకోలేదు.

లలి—ఇంత పనిచేసేటప్పుడు ఏమాత్రం మాట పొక్కనివ్వకూడదు. కాదూ?

రాధా—పాపం! ఎంతో కల్సిమెలిసి వుండేవాడు; పోయాడంటే నమ్మకంలేకుండా వున్నాను–నివురుగప్పిన నిప్పులాగా! బాగుంది. ఇదీమంచిదేనేమోలే! అధమం–అతని జీవితానికి బహుశా మనజీవితానికి కూడాను. ఇప్పుడిక మనమే మిగిలాం–ఒకరికి వకరం–నాకు నువ్వూ–నీకు నేను లలితా! అప్పుడప్పుడూ, నేననుకుంటూ వుంటా–నిన్ను ఏమిటో–నాలో కలిపేసుకోవాలనీ–నాలో లీనం చేసుకోవాలనీ – ఒక్కొక్కప్పుడు నువ్వేదో ప్రమాదస్థితిలో వుంటే–నీకోసం నాజీవితపు రక్తాన్ని ధారపోసి నిన్ను రక్షించుకోవాలనీ వుంటుంది.

లలి—తక్కిన ఉత్తరాలు చూచుకోరూమరి?

రాధా—అహహ! ఇవ్వాళగాదు–నిన్నివ్వాళ ఒదలలేను.

లలి డాక్టర్‌గారి మరణవార్త మరపురావటం లేదా!

రాధా—అవును. ఏదోమనసును కలచివేస్తుంది. ఇది ఎల్లాగన్నా మర్చిపోవాలి.

లలి—(భుజాలమీద చెయ్యివేసి) నే నిక వెళ్తా.

రాధా—ఏం! నాకిన్నరసానికి నిద్రవస్తోందా! పోయిపడుకో. ఈ ఉత్తరాలన్నీ ఆఫీసుగదిలో పడేసి నేనూ వస్తా. (అని ఉత్తరాలన్నింటినీ తీసుకుని ఆఫీసుగదిలోకి వెళతాడు)

[ లలిత దర్వాజా దగ్గరకెళ్ళి అటే చూస్తూనుంచుంటుంది. లోపలఏదో పడినశబ్దం నిట్టూర్పుతో "పిల్లలు" అని అదిరిపడి అంటుంది. గబగబా వెనక్కివచ్చి ఒకనల్లని శాలువా కప్పుకుని కూర్చుంటుంది. రాధాకృష్ణ వస్తాడు]

రాధా—లలితా !

లలి—ఆ ! (నిశ్చలంగా అంటుంది)

రాధా—ఈ ఉత్తరంలో ఏముందో తెలుసా ?

లలి—తెలుసు. అంతా తెలుసు. (లేచి) నన్ను వెళ్ళనివ్వండి.

రాధా—ఎక్కడికి ?

లలి—మీరు నన్ను బాగుచెయ్యలేరు.

రాధా—బాగుచెయ్యలేను. అదిసరే. ఇది నిజమేనా! నేను చదివింది-అహ కాదు-నిజంకాకూడదూ! - కాదూ ?

లలి—అది నిజమే; ఈ ప్రపంచాన్ని యింత ఎక్కువగా నమ్మటం మంచిదికాదు.

రాధా—ఈ అర్థంలేనిమాటలు కట్టిపెట్టు.

లలి—ఆ.

రాధా—ఎందుకుచేశా వీ పాడుపని? నువ్వుచేసిన పనేమిటో తెలుసా ?

లలి—సంగతులన్నీ సంపూర్ణంగా —

రాధా—హుంహ్–! ఎంతబాగా తెలుస్తూంది, ఈ ఎనిదేళ్ళ నుంచీ నువ్వే నా సర్వస్వం-నాగర్వం-నా సంతోషం అనుకున్నాగాని యింతఝుఠాకోర్, ఇంతపచ్చి-పచ్చి-దొంగవనుకోలేదు. సిగ్గయినా లేకుండా నేనే చేశానంటున్నావా, ఛీ, ఛీ! నా కిదివరకే ఇదెందుకు తట్టలేదో! తండ్రి వెధవగుణాలెక్కడికి పోతాయి. పాడువంశం! ఒక నీతిలేదు. ఒక తాహతులేదు. అటువంటివాడికూతురు

ఇలాగాక ఎట్లావుంటుంది! రూపంచూసి పెళ్ళాడినందుకు తగిన శాస్తి చేశావ్! అసలుఫాయిదాలతో బాకీ తీర్చుకున్నావ్.

లలి—బాకీతీర్చుకున్నాను.

రాధా—నాసుఖాన్ని నాశనంచేశావ్; నాగర్వాన్నే అణగద్రొక్కేశావ్; పరువుప్రతిష్ఠలన్నీ పాడుచేశావ్; నేనిప్పుడు ఆ నారాయణయ్యచేతిలో ఆటబొమ్మని. వాడేం చేసినా కాదనలేను ఇంత అధమాధమస్థితిలోనికి రావటానికి కారణం! ఒక ఆలోచనలేని ఆడది

లలి—నే నడ్డుతప్పుకుంటే మీరు బయటపడ్తారు.

రాధా—చాల్లే ఉపన్యాసాలు అడ్డుతప్పుకుంటుందిట-అడ్డు. ఆ వెధవ-ఈవార్త నడిబజారులో దండోరా వేస్తాడు. ఈ నేరానికి నేనూ ఒక పార్టీనని-దీని వెనక నేనూ వున్నానంటారు అందరూ. ఇన్నాళ్ళూ నిన్ను దేవతవని పూజించినందుకు చాలా ఉపకారం చేశావ్. చాలా కృతజ్ఞుణ్ణి. అర్థమయిందా నువ్వేం చేశావో!!

లలి—ఆ— :

రాధా—ఇదంతా తెలిసి ఎలావూరుకోను? కాని సర్దుకోకపోతే ఎలా? ఆ వెధవశాలువా కప్పుకున్నావెందుకూ? తీసెయ్యి ముందు. (తనే తీసేస్తాడు కాస్త కోపంతగ్గి) ఎలాగో దీన్ని సర్దుకోవాలి, దీన్నంతటినీ కప్పిపుచ్చాలి. అదిసరే అట్టావుంచు. మరి నీసంగతి ఏమిటి?

లలి—నాసంగతి ఏముంది ?

రాధా—ఉంది చెప్తాను. మనిద్దరం యీ ప్రపంచదృష్టిలో మాత్రం యిదివరకటిలాగే వుంటాం. ఉండక తప్పదు. నువ్విక్కడే యీవూళ్ళోనే వుంటావు-ఇదివరకులాగే. కాని ఇకనుంచీ నువ్వు పిల్లల్ని పెంచకూడదు. పిల్లల్ని పెంచడానికి నువ్వు అసలుపనికిరావు. ఇక నిన్ను నమ్మటానికే వీల్లేదు; ఇంతవరకూ నిన్ను ప్రేమించిన నేనే యీమాట లంటున్నానంటే — —. ఇంకా ఎక్కడి ప్రేమ!—ప్రేమ; సుఖం!! వాటిసంగతి అయిపోయింది. ఇక వున్నదల్లా యీ మిగిలిన అస్థిపంజరాలతో-నాటకం ఆడటం. అదీ ఈప్రపంచంకోసమే! తెలిసిందా!

(బయట తలుపుకొట్టిన శబ్దం)

రాధా—అదేమిటి! ఎవరా తలుపుకొట్టేది ? (వెళ్ళి తలుపు తీస్తాడు) [నారాయణయ్య వస్తాడు.]

నారా—క్షమించాలి; నిద్రపోతుంటారనుకున్నా. ఈఉత్తరం యివ్వటానికి వచ్చా, చదువుకోండి; నేవెళ్తా (వెళ్తాడు)

రాధా—ఉత్తరం! మళ్ళా ఏమని ఉత్తరం! వెధవ లోకువ! ఏం రాశాడో ?

లలి—చదవండి.

రాధా—చదవటానికి నాకూ భయంగానే వుంది; మన ఇద్దరి సర్వనాశనం దీంట్లో వున్నది. కానియ్యి. చదవక తప్పదుగా; (విప్పి చదువుతాడు) లలితా! ఆగు; మళ్లా

చదవనీ! అంతే! లలితా! నేను బయట పడ్డాను. బ్రతికి పోయాను. లలితా!

లలి—మరి నేనూ ?

రాధా—ఆ! ఆ! నువ్వూ కూడా! మనిద్దరం. ఇదిగో; నీ ఛాండ్ తిరిగి పంపేశాడు. పశ్చాత్తాపపడుతూ ఉత్తరం కూడా రాశాడు. తన జీవితమే మారిపోయిందట. సరే వా డెల్లాపోతే మన కేం! ఇహ ప్రపంచంలో నిన్నెవ్వరూ ఏం చెయ్యలేరు-లలితా! మొదట ఈ దరిద్రపు కాగి తాల్ని నాశం చెయ్యనీ. వీటి మొహం కూడా చూడ కూడదు. ఇది అంతా ఒక దుస్స్వప్నంలాగా మాయమై పోవాలి. అబ్బ!...అయిపోయింది. ఈపండగ మూడు రోజులూ మూడు యుగాలుగా వున్నాయి కాదూ నీకూ ?

లలి—మహా మథన పడ్డాను.

రాధా—ఆ! ఆగు. ఇక వాటి సంగతి తలపెట్టకు. అంతా అయిపోయింది. నీ కింకా అర్థంకాలేదా? ఏమిటి-అయి పోయిందని; అయిపోయింది-లలితా; అంతా అయి పోయింది; అదేమిటీ ? తెల్లబోయిన మొహం నువ్వూ- ఇదంతా నమ్మలేకుండా వున్నావుగాదూ ? కాని యిది నిజం. ప్రమాణ పూర్తిగా నిజం-ప్రమాణ పూర్తిగా నిన్ను క్షమించాను. నువ్వు చేసిన దంతా, చేసినవన్నీ, నామీద ప్రేమతోనే నాకోసమే చేశావని నాకు తెలుసు.

లలి—అది నిజమే.

రాధా—ఆదర్శ ప్రాయమైన భార్యా-భర్త నెల్లా ప్రేమించాలో అల్లాగే చేసినపని, ఎంత నేరమయిందీ నీకు తెలియదు. అంతే. ఆ నేరం చేసినందువల్ల నా ప్రేమా-అనురాగం ఏమన్నా తగ్గిందనుకుంటున్నావా ?- లేదు-నాసలహా తీసుకోకుండా యికమాత్రం ఇటువంటిపనీ చేయకు. చాలు. నా ప్రథమకోపంలో అన్నవన్నీ మర్చిపో.

లలి—ఆగండి. నన్నూ కాసేపు మాట్లాడ నివ్వండి.

రాధా—ఇంకెందుకూ-అనవసరమైన మాటలు !

లలి—మీా కనవసరమే. కాని నాకవసరం.

రాధ—అల్లా అన్నా వేమిటి (కూర్చుంటూ) నాకేం అర్థం కావటం లేదు.

లలి—మీా కర్థం కాదు; మీారు నన్నెప్పుడూ, అర్థంచేసుకోలేదు. ఈ రాత్రికి ముందు. (రాధాకృష్ణ ఏదో చెప్పబోగా) ఆగండి-నామాటకి అడ్డురాకండి! మనిద్దరం యిల్లా కూర్చోవటంలో ఏదో వింత వుందని మీాకు తట్టడం లేదూ ?

రాధ—ఏమిటది ?

లలి—ఎనిమిది సంవత్సరాలయింది. ఈ ఎనిమిదేళ్ళలో యిదే మొదటిసారి. భార్య భర్తలుగా, స్త్రీపురుషుగా-వేళాకోళం మానేసి- నిక్కచ్చిగా మాట్లాడుతున్నాం. కాదూ ?

రాధా—అంటే ! !

లలి—ఈ ఎనిమిది సంవత్సరాల్లో మనిద్దరం కలిసి కఠిన సమస్య కూడా చర్చించలేదు. కాదూ ?

రాధా—అంటే - నాబాధలూ విచారాలూ నీతో కూడా అస్తమానం చెప్పి-నిన్ను వేధించాలనా?

లలి—మీ ఉద్యోగం గొడవకాదు. ఇంతవరకూ అసలు సంగతులు మనం మాట్లాడుకోలేదు.

రాధా—అందువల్ల నీకేం లాభం లలితా ?

లలి—అదే నేననేది; మొదట మానాన్నవల్లా, తర్వాత మీవల్లా నాకన్యాయం జరిగింది.

రాధా—అన్యాయమా ! మాయిద్దరివల్లా ? మాయిద్దరివల్ల? ప్రపంచంలోకల్లా నీకు ముఖ్యమైనవాళ్ళం - ముఖ్యంగా నిన్ను ప్రేమించిన ... ...

లలి—మీరు నన్ను ప్రేమించలేదు; ప్రేమించిన సంతోషం అనుభవించారు. అంతే.

రాధా—ఏమంటున్నావ్ ?

లలి—కాని ఇదే నిజం ; చిన్నతనంలో తన అభిప్రాయాన్నే నాకు చెప్పేవాడు మానాన్న. మరో అభిప్రాయం నాకు వుండటం ఆయనకిష్టం ఉండేదికాదు. అందుకని నే నేదీ ఆయనతో అనేదాన్నికాదు. ఆయన నన్ను ఒక బొమ్మ లాగ- నే నాడుకొనే బొమ్మల్లో ఓబొమ్మలాగ - చూశే వాడు. ఆయింటినుంచీ నన్ని యింటికి మార్చిన తర్వాత —

రాధా—మనపెళ్ళి కిదా పర్యాయపదం?

లలి—ఈయింట్లో-మీఅభిరుచులప్రకారం అన్నీ ఏర్పరిచారు. మీఅభిరుచులే నావీకూడా అయిపోయాయి. అథమం, నే నట్లా నటించాను. ఏదో మీయిష్టం వచ్చినట్టునటించ

వల్సినదాన్ని నేను; కూటికీ గుడ్డకీ – మీచెంత చేరిన ఒక దిక్కుమాలినదాన్ని.

రాధా— ఎంత అన్యాయంగా మాట్లాడుతున్నావ్ ! నువ్విక్కడ సుఖపడటంలేదూ ?

లలి—సుఖపడుతున్నా ననుకున్నా గాని నిజానికి లేదు.

రాధా— లేదూ ? సుఖపడటం లేదూ ?

లలి— లేదు. అది సుఖంకాదు. కాస్త ఆనందం. అంతే ; ఆయింట్లో మానాన్నకు ఒక బొమ్మలాంటి కూతురు నయినట్టూ ఈయింట్లో మీకూ ఒకబొమ్మలాంటి భార్యను. మనపిల్లలు బొమ్మపిల్లలు. చిన్నప్పుడు నేను బొమ్మలతో ఆడుకొని ఆనందపడినట్టే, మీతో కాపరంచేస్తూ ఉన్నాట్ట్యా ఆనందపడ్డాను. మనపెళ్ళి వక బొమ్మల పెళ్ళి.

రాధా—నువ్వన్నదే నిజమయినా, యిహామీద అల్లావుండదు ఆటవేళ అయిపోయింది. ఇకపాఠాలు చదువుకుందాం.

లలి—ఎవరిపాఠాలు ? నావా ? పిల్లలవా ? మీవా ?

రాధా—నీవీ, పిల్లలవీ. నావీకూడా ?

లలి— నేను సరైన భార్యగా యీపొందేటట్లు చేయటం మీచేతకాదు.

రాధా—ఆమాట మనస్ఫూర్తిగా అనగలవ్ !

లలి—నేను మీపిల్లల్ని పెంచటానికి అనర్హురాలినే !

రాధా—లలితా !

లలి—ఆమాట మీరే అన్నారుగా!

రాధా—కోపంలో అన్నదాన్ని పట్టుకొని ... ...

లలి—మీది తప్పుఅనిగాదూ, ఒప్పనీకాదూ; కాని యిప్పు డు నాకోవిధి కనిపిస్తోంది. ఆవిధినినిర్వహించటం నేర్చుకో వాలి; అది నేర్పటం మీచేతకాదు; అందుచేత నేను మిమ్మల్ని వదలి వెళ్ళాల్సి వస్తోంది.

రాధా—ఏమంటున్నావ్ ?

లలి—నేనొంటరిగా నిలవాలి; నన్ను గురించే నే పూర్తిగా తెల్సుకోవాలి. అందుచేత నేను మీతో వుండలేను.

రాధా—లలితా!

లలి—నేను వెళ్తున్నాను – ఈరాత్రికి ఎక్కడన్నా గడిపి—

రాధా—నీకేమన్నా పిచ్చా! దీనికి నేవప్పుకోను. నువ్వు వెళ్ళటానికి వీల్లేదు.

లలి—అలా ఆజ్ఞాపించి నన్నాపలేరు. నావస్తువులు తప్ప మీఆస్తి ఏమీ తీసుకువెళ్ళటం లేదు.

రాధా—ఇదేం పిచ్చా! తెలివి తక్కువా ?

లలి—ఎల్లాగన్నా కాస్త తెలివి సంపాదించుకోవాలి నేను.

రాధా—సంసారాన్నీ భర్తాపిల్లల్నీ వదలి, ఇల్లు వదలిపోవ టమా? కాస్త లోకం ఏమంటుందోననిఅయినాఆలోచించు.

లలి—లోకంసంగతి నేను అసలు ఆలోచించలేదు. నా సంగతే నాక్కావాలి.

రాధా—అంతా వింతగావుందే! నీ విధినిగూడా లక్ష్యం పెట్టకుండా......

లలి—నావిధి ఏమిటని మీ ఉద్దేశ్యం ?

రాధా—అదీ నేనేచెప్పాలా! ఒకభార్యగా, ఒకతల్లిగా కొన్ని పవిత్రమైన విధులు లేవూ ?

లలి—అంతకంటె పవిత్రమైనవీ వున్నాయి.

రాధా—ఇంకేమున్నాయి?

లలి—నా అంతరాత్మకు సంబంధించిన పతివ్రతవిధులున్నాయి.

రాధా—అంతకంటె ముందు నువ్వు తల్లివి-భార్యవి.

లలి—అవంటే నాకు నమ్మకం లేదె. అంతకంటే ఎక్కువగా నేను మనిషిని; భార్యగా తల్లిగా బ్రతకటానికి ముందు ఒక మనిషిగా బ్రతికటం నేర్చుకోవాలి. ప్రపంచంలో చాలామంది మీరనేదే నిజమంటారు. సంఘం మీతోనే ఏకీభవిస్తుంది. పుస్తకాల్లో మీరనేదేవుంది. కాని వీటి అన్నింటితో నేను ఏకీభవించను. నాసంగతి నేను ఆలోచించుకొని, నేనీ విషయాలు అర్థంచేసుకోవాలి.

రాధా—అంటే అది నీకర్థంకాలేదన్నమాటేగా!

లలి—కాలేదు. ఇక్కణ్ణించి వెళ్ళి వాటన్నింటిల్లో ఎంత సత్యం వున్నదీ ఆలోచిస్తాను.

రాధా—శాస్త్ర నీతి అంటూ ఒకటుందని తెల్సా—పోనీ—అవన్నీ అర్థంకాకపోతే మానె.

లలి—అదీచెప్పటం కష్టమే; నీతిఅంటేఏమిటో విచారించటంలో నాదృష్టి వేరూ, మీ దృష్టి వేరూగావుంది. నా దృష్టిలో యీ చట్టాలు మనిషి మనిషికీ వేరు వేరుగా వుంటున్నాయి. చట్టం శాసనం—న్యాయంగావున్నాయని నాకు అనిపించటంలేదు. ఈచట్ట ప్రకారం ఒకస్త్రీ చని పోతున్న తనతండ్రిని బాధపెట్టకుండా వుండలేదు. అదీ తన భర్తని రక్షించుకోటానికి.

రాధా—చిన్నపిల్లలాగ మాట్లాడుతున్నావ్! నువ్వు పుట్టి పెరిగిన యీ ప్రపంచం సంగతే నీకు తెలియదేం!

లలి—తెలియదు. న్యాయం నాదో యీ ప్రపంచానిదో తెల్సుకోవాలి. తెల్సుకోవటానికే వెళ్తున్నాను.

రాధా—నీమతి బాగాలేదు. సంధో-పిచ్చో పుట్టింది.

లలి—నా "మతి" ఇంత స్థిరంగా నిర్మలంగా ఎన్నడూ లేదు.

రాధా—మతి స్థిరంగా వుండేనా-ఇదంతా?

లలి—ఆ.

రాధా—అయితే దీనంతటికి ఒక్కటే అర్థం.

లలి—ఏమిటది ?

రాధా—నేనంటే నీకు ప్రేమలేదు.

లలి—అంతే.

రాధా—లలితా! ఆమాటకూడా అనగల్గుతున్నావా ?

లలి—అనటానికి చాలా బాధగానే వుంది. మీరు నన్ను చాలాదయగా చూశేవారు. కాని ఏంచెయ్యను? మీ మీద ప్రేమలేదు.

రాధా—లేకపోవటానికి కారణం చెప్పగలవా ?

లలి—చెప్పగలను...ఈరాత్రి నే ననుకున్న అద్భుతమైన కార్యం జరగలేదు. దాంతో కనిపెట్టాను. మీరు నేను కొన్న లాంటి మనిషి కాదని.

రాధా—కాస్త అర్థమయ్యేలా చెప్పు.

లలి—ఓపికగా యీ ఎనిమిదిసంవత్సరాల్నించీ కనిపెట్టుకుని వున్నా. నాకు తెల్సు-అద్భుతమైన కార్యాలు రోజూ జరగవు. ఈ దురదృష్టం మనల్ని చుట్టుకుంది. ఇక యీ విచిత్రం జరుగుతుందిగదా అనుకున్నా. నారాయణయ్య బాక్సులో వేసిన ఉత్తరం మీరు ఒప్పుకుంటా రనుకో

లేదు. పుత్తరంతో సంగతులు బయటపెడితే పెట్టుకో మంటారనుకొన్నాను. బయటపెట్టిన తర్వాత.

రాధా—నా భార్యని అపకీర్తి పాలుచేసిన తర్వాత-

లలి—తర్వాత "నేనే దోషిని—నాభార్యగాదు" అని నేరం తలపైన వేసుకుంటారనుకున్నా.

రాధా—లలితా!

లలి—మీరంత త్యాగంచేస్తుంటే నేనువప్పుకుంటానని కాదు. ఎప్పటికీ ఒప్పుకోను. కాని అప్పుడు మీమాటలముందు నామాటలకి విలువవుండేది కాదు. అందరూ మిమ్మల్నే నమ్మేవారు. ఆవిచిత్ర సంఘటన తప్పించటానికే నేను విషం పుచ్చుకుందామనుకున్నా.

రాధా—నీకోసం ఏకష్టమన్నా పడతాను-కావాలంటే ఎంత దరిద్రమన్నా-దుఃఖమన్నా అనుభవిస్తాను. కాని ప్రేమ కోసం గౌరవాన్ని త్యాగం చెయ్యలేను.

లలి—ఆగౌరవాన్నే పురుషునికోసం లక్షలాది స్త్రీలు త్యాగం చేస్తున్నారు.

రాధా—ఈమాటలు ఆలోచనలేని పిల్లలు మాట్లాడాలి గాని ...

లలి—అవచ్చు. కాని మీమాటలు నేననుకున్నట్టుగా లేవు. మీభయం తీరగానే, మీగౌరవాన్ని ఎదుర్కొన్న భయంతీరగానే, ఏమీ జరగలేదనీ. ఏమీ జరగనట్టే మామూలుగా మాట్లాడటం ఆరంభించారు. ఇదివరకు మల్లేనె నేనుమళ్ళీ మీకిన్నెరసానిని – మీరామచిలకని మీగృహలక్ష్మిని. భేదం ఒక్కటే. ఇకముందీ; బొమ్మని

చాలాజాగ్రత్తగా చూడటానికి పూనుకున్నారు. అప్పుడు నాకు తట్టిందిది. ఈ ఎనిమిదేళ్ళూ నేనొక విచిత్రమైన మనిషితో కాపురం చేస్తున్నాను. ముగ్గురి పిల్లల్ని కూడా కన్నాను.

రాధా—నీమనస్సు విరిగింది.

లలి—అవును. ఇక మీరాడుకొనే బొమ్మ వెళ్ళిపోతోంది. పిల్లల్ని చూడకుండా వెళుతున్నాను. నాదగ్గరకంటే మీదగ్గరే బాగుంటారు. ఇదిగో! మీ వుంగరం. నాది నా కివ్వండి (ఉంగరం యిస్తుంది)

రాధా—ఇదికూడానా ?

రాధా—అయితే యిహ ఎప్పటికీ మనసు మార్చుకోవా ?

లలి—మార్చుకోను. జరగాల్సిన విచిత్రం జరిగేదాకా—

రాధా—ఏమిటి ? ఏమిటా విచిత్రం—?

లలి—మీరు నేనూ ఇంకా బాగా మారిపోవాలి. అంత విచిత్రం ప్రపంచంలో జరుగుతుందని నేననుకోను. కాని మన మనసులు కలిసి "నిజమైన వైవాహిక బంధం" ఏర్పడేటంతగా మనం మారిపోవాలి. అంతవరకూ సెలవు! (వెళ్ళి పోతుంది)

రాధా—లలితా! లలితా! లలితా! వెళ్ళిపోయింది. (కూలబడి) ఇల్లంతటినీ శూన్యంచేసి వెళ్ళిపోయింది అన్నిటికంటె ఇది మరీ విచిత్రంగా వుంది

(బయట తలుపు మూసిన శబ్దం)

తెర

